॥ ఓం గణేశాయ నమః ॥

# సంస్కృతపాఠమాలా

## 1వ పాఠము

సంస్కృతములోని నామవాచకములన్నియు అజంతములు, హలంతములని రెండు విధములు. అచ్చులు అంతమున గలవి అజంతములు.

ఉదాహరణము:- రామ్+అ=రామ. హర్+ఇ=హరి మొదలగునవి.

హల్లులు అంతమున కలవి హలంతములు.

ఉదా:- జలముచ్ మరుత్ మొ॥

సంస్కృతభాషకు ఏకవచనము, ద్వివచనము, బహువచనమని మూడు వచనములు కలవు. కాని తెలుగు భాషకు ఏకవచనము, బహువచనము లున్నవే గాని ద్వివచనము లేదు. తెలుగులో నా యా శబ్దముయొక్క అర్థమునుబట్టి ఆ యా శబ్దములు ఆ యా లింగములని గుర్తించెదము. కాని సంస్కృతములో శబ్దముయొక్క రూపమును బట్టియు పెద్దల ప్రయోగమును బట్టియు లింగము సహజసిద్ధముగా నుండును. 'భార్యా' అను అర్థము నిచ్చు పత్నీ పరిగ్రహః, కళత్రం అను శబ్దములన్నియు పత్నీ శబ్దమువలె స్త్రీ లింగములు కావు. 'పరిగ్రహః' అనగా భార్య. కాని 'పరిగ్రహః' అను శబ్దము పుంలింగము. 'కళత్రం' అనగా భార్య. కాని 'కళత్రం' శబ్దము నపుంసకలింగము. మనుష్యవాచకమైన 'రామః' పుంలింగము. కాని జడవాచకములైన వృక్షః, పటః, ఘటః మున్నగునవి పుంలింగములు. ఇట్లే లతా, పేటికా, నాసికా మున్నగునవి స్త్రీలింగములు. వ్యాకరణవేత్తలు లింగనిర్ణయమునకు గాను కొన్ని సూత్రములను చెప్పియున్నారు. కాని శిష్టుల ప్రయోగానుసారమే ఆ యా శబ్దము లయా లింగములని గ్రహింపవలెనని అమరసింహుడు 'శేషంతు శిష్టప్రయోగతః' అని వచించెను.

సంస్కృతములో సంబోధనతోసహా ఎనిమిది విభక్తులు కలవు. రామ, తద్, యుష్మద్ మున్నగు శబ్దములకు ప్రత్యయములను చేర్చిన పిమ్మటనే ప్రయోగింపవలెను. ప్రత్యయములకు పూర్వమున్న రూపమును ప్రాతిపదికమందురు. గనిలోనుండి తీసిన బంగారును కంసాలె అట్లే ఆభరణముగా చేయుట అశక్యము. కాని దానికి కొంత తామ్రమును కలిపిన పిదపనే

ఆభరణము చేయగలుగును. ఇట్లే రాము, శివ, తద్ మొదలగు శబ్దములకు సు ఔ జస్ మున్నగు ప్రత్యయములను కలిపిన తరువాతనే ప్రయోగింప వలసియుండును.



| ప్రత్యయములు | | | విభక్తులు |
|---|---|---|---|
| సు | ఔ | జస్ | ప్రథమావిభక్తిః |
| అమ్ | ఔట్ | శస్ | ద్వితీయావిభక్తిః |
| టా | భ్యామ్ | భిస్ | తృతీయావిభక్తిః |
| జే | భ్యామ్ | భ్యస్ | చతుర్థీవిభక్తిః |
| ఙసి | భ్యామ్ | భ్యస్ | పంచమీవిభక్తిః |
| ఙస్ | ఓస్ | ఆమ్ | షష్ఠీవిభక్తిః |
| ఙి | ఓస్ | సుప్ | సప్తమీవిభక్తిః |

(సూచన:– వీనిని వీలైతే కంఠస్థము చేయండి)

## తెలుగులో విభక్తి ప్రత్యయములు

| | |
|---|---|
| డు, ము, వు, లు | ప్రథమావిభక్తి |
| ని, ను, ల, కూర్చి, గురించి | ద్వితీయావిభక్తి |
| చేత, చే, తోడ, తో | తృతీయావిభక్తి |
| కొఱకు, కై | చతుర్థీవిభక్తి |
| వలన; కంటె | పంచమీవిభక్తి |
| కి, కు, యొక్క | షష్ఠీవిభక్తి |
| అందు, న | సప్తమీవిభక్తి |
| ఓ, ఓయీ, ఓరి, ఓసి | సంబోధనాప్రథమావిభక్తి |

సూచన:– వీనిని తప్పక కంఠస్థము చేయవలెను.

## అజంతము — పుంలింగము

### అకారాంతము — 'రామ'

('రామ' శబ్దమునకు ఈ దిగువ ఎనిమిది విభక్తులలో రూపము లివ్వబడినవి)

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | రామః | రామౌ | రామాః |
| సంబోధనాప్రథమావిభక్తి | హే రామ | హే రామౌ | హే రామాః |
| ద్వితీయావిభక్తి | రామమ్ | రామౌ | రామాన్ |
| తృతీయావిభక్తి | రామేణ | రామాభ్యామ్ | రామైః |
| చతుర్థీవిభక్తి | రామాయ | రామాభ్యామ్ | రామేభ్యః |
| పంచమీవిభక్తి | రామాత్ | రామాభ్యామ్ | రామేభ్యః |
| షష్ఠీవిభక్తి | రామస్య | రామయోః | రామాణామ్ |
| సప్తమీవిభక్తి | రామే | రామయోః | రామేషు |

ఇట్లే సోమ, భీమ, మోహన, వృక్ష, వివేక మొ॥ శబ్దములకును రూపములను ఊహించి నేర్చవలెను.

పై వానికి ఈ క్రింది విధముగా అర్థమును తెలిసికొనవలెను.

ప్రథమావిభక్తి

రామః = రాముడు రామౌ = ఇద్దరు రాములు రామాః = చాలామందిరాములు

ద్వితీయావిభక్తి

రామం = రాముని రామౌ = ఇద్దరు రాములను, రామాన్ = చాలామంది రాములను.

తృతీయావిభక్తి

రామేణ = రామునిచే రామాభ్యాం = ఇద్దరు రాములచే రామైః = చాలా మంది రాములచే

ఈ రీతి ఇతరత్ర ఊహింపవలెను.

## అభ్యాసము 1

ఈ క్రింది అకారాంతపుంలింగశబ్దములకు ఎనిమిది విభక్తులలో అన్ని వచనములలో రూపములను వ్రాయుము—

ఘటః (కుండ); పటః (వస్త్రము); కలశః (చెంబు); కలమః (కలము); వృక్షః (చెట్టు)

## అభ్యాసము 2

క్రింది శబ్దములకు తెనుగులో అర్థమును వ్రాయుము.

1. సూర్యస్య 2. రామాణాం 3. ఘటే 4. కలమం 5. కలశయోః

## కృపణునిపై లక్ష్మీదేవికి కృప ఏల?

శూరం త్యజామి వైధవ్యాదుదారం లజ్జయా పునః
సాపత్న్యాత్పండితమపి తస్మాత్కృపణమాశ్రయే ॥

లక్ష్మి ఇలా అంటున్నది— నేను శూరున్ని వరిస్తే వైధవ్యభీతి; ఎందుకంటె అతనికి రణభూమిలో హఠాత్తుగా మరణం వాటిల్లవచ్చు. కాన శూరున్ని నేను వరించను. ఉదారంగా దానంచేసేవాన్ని కూడ ఆశ్రయించను. అతని వద్దకు వెళ్ళటానికి నాకు ఎంతో సిగ్గు; ఏలనంటే అతడు నన్ను ఎవ్వరికోఒకరికి ఇచ్చేస్తాడు. పండితున్ని అపుడే సరస్వతి వరించింది. కాన అతన్ని నేను వరించి సవతి కావటం నాకిష్టంలేదు. అందుకే నేను కృపణున్ని (లోభిని) ఆశ్రయిస్తాను. అతనైతే నన్ను నిష్ఠతో కాపాడును.



# సంస్కృతపాఠమాలా

## 2వ పాఠము

1. **నామవాచకములు:–** పేర్లను తెలుపు మాటలను నామవాచకము లందురు

ఉదా:– రామః, వేణుః, సీతా, పేటికా (పెట్టె), క్షీరం (పాలు), తూలికా (పెన్సిలు) మొ॥

క్రింది నామవాచకములను నేర్చుకొనుడు. (ఇవి అకారాంతపుంలింగములు)

| | | |
|---|---|---|
| కలమః = కలము | కూపః = బావి | హస్తదీపః = టార్చి |
| ఘటః = కుండ | పాచకః = వంటవాడు | పాకః = వంట |
| కలశః = చెంబు | ఆపణః = అంగడి | మానవః = మనుష్యుడు |
| పర్వతః = కొండ | పణ్యాకః = వ్యాపారి | గుడః = బెల్లము |
| సింహః = సింహము | ఉటజః = గుడిసె | మేషః = మేక |
| భల్లూకః = ఎలుగుబంటి | దీపః = దీపము | ఛాత్రః = విద్యార్థి |
| పాఠః = పాఠము | కాచదీపః = లాంతరు | బాలకః = బాలుడు |
| సోదరః = అన్నలేకతమ్ముడు | పుత్రః = కుమారుడు | గ్రామః = గ్రామము |

2. **క్రియలు:-** పనిని తెలుపు మాటలు క్రియలు. ఉదా: చేయును, తినును మొ॥

వర్తమానకాలము — ప్రథమ పురుషము

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| కరోతి = చేయుచున్నాడు | కురుతః = (ఇద్దరు) చేయుచున్నారు | కుర్వన్తి = చేయుచున్నారు |
| గచ్ఛతి = వెళ్ళుచున్నాడు | గచ్ఛతః = (ఇద్దరు) వెళ్ళుచున్నారు | గచ్ఛన్తి = వెళ్ళుచున్నారు |
| ఆగచ్ఛతి = వచ్చుచున్నాడు | ఆగచ్ఛతః = (ఇద్దరు) వచ్చుచున్నారు | ఆగచ్ఛన్తి = వచ్చుచున్నారు |
| లిఖతి = వ్రాయుచున్నాడు | లిఖతః = (ఇద్దరు) వ్రాయుచున్నారు | లిఖన్తి = వ్రాయుచున్నారు |
| ఖాదతి = తినుచున్నాడు | ఖాదతః = (ఇద్దరు) తినుచున్నారు | ఖాదన్తి = తినుచున్నారు |

| | | |
|---|---|---|
| తోలయతి = తూచుచున్నాడు | తోలయతః = (ఇద్దరు) తూచుచున్నారు | తోలయన్తి = తూచుచున్నారు |
| చరతి = మేయుచున్నది | చరతః = (రెండు) మేయుచున్నవి | చరన్తి = మేయుచున్నవి |
| పఠతి = చదువుచున్నాడు | పఠతః = (ఇద్దరు) చదువుచున్నారు | పఠన్తి = చదువుచున్నారు |
| అస్తి = ఉన్నాడు, ఉన్నది | స్తః = (ఇద్దరు) ఉన్నారు | సన్తి = ఉన్నారు, ఉన్నవి |

సూచన:- కరోతి అను శబ్దమునకు చేయుచున్నాడు అనియేగాక 'చేయును' అనికూడ అర్థము కలదు. కాన ఇతరత్రకూడ 'గచ్ఛతి' అనగా వెళ్ళుచున్నాడు అనియేగాక 'వెళ్ళును' అని కూడ గ్రహింపవలెను. సంస్కృతములో క్రియలు అన్ని లింగములలో వర్తించును.

3. **అవ్యయములు:-** లింగము, వచనము, విభక్తి లేనివి అవ్యయములు.

ఉదా:- అక్కడ, ఇక్కడ, ఎక్కడ మొ॥

అత్ర = ఇక్కడ, ఇక్కడకు ; తత్ర = అచ్చట, అచ్చటకు ;
కుత్ర = ఎచ్చట, ఎచ్చటకు

పై శబ్దములకు లింగము, వచనము, విభక్తులు లేవు.

## వాక్యరచన

పరిశీలింపుడు —

రాముడు వెళ్ళుచున్నాడు — రామః గచ్ఛతి.
బాలకుడు కలముతో వ్రాయును — బాలకః కలమేన లిఖతి.
పర్వతములో పులి ఉన్నది — పర్వతే వ్యాఘ్రః అస్తి.
అంగడిలో వర్తకుడు ఉన్నాడు — ఆపణే పణ్యకః అస్తి.
గోపాలుడు బెల్లము తినుచున్నాడు — గోపాలః గుడం ఖాదతి.
గుడిసెలో ఇద్దరు బాలకులు చదువుచున్నారు — ఉటజే బాలకౌ పఠతః
సీత పాఠము వ్రాయుచున్నది — సీతా పాఠం లిఖతి.

చెంబులో పాలు ఉన్నది — కలశే క్షీరమ్ అస్తి.
కుండ ఎక్కడ ఉన్నది? — ఘటః కుత్ర అస్తి ?
గోవిందుడు ఇక్కడ ఉన్నాడు — గోవిన్దః అత్ర అస్తి.
రామునియొక్క చెంబు ఇక్కడ ఉన్నది—రామస్య కలశః అత్ర అస్తి.
ఇచ్చట లత చదువుచున్నది — అత్ర లతా పఠతి.
రాముని పెన్సిలు ఎక్కడ ఉన్నది?—రామస్య తూలికా కుత్ర అస్తి. ?

ఇద్దరు బాలకులు ఎక్కడ చదువుదురు? బాలకౌ కుత్ర పఠతః?
శంకరుని సోదరులు వచ్చుచున్నారు శఙ్కరస్య సోదరాః ఆగచ్ఛన్తి.
విద్యార్థులు బెల్లమును తినుచున్నారు. ఛాత్రాః గుడం ఖాదన్తి.

## అభ్యాసము 1

1) ఈ క్రింది వాక్యములను సంస్కృతములో వ్రాయండి.

1. రాముడు దశరథునియొక్క పుత్రుడు. 2. లక్ష్మణ శత్రుఘ్నులు రామునియొక్క సోదరులు. 3. ఇద్దరు విద్యార్థులు వచ్చుచున్నారు. 4. మేకలు ఎచ్చట మేయుచున్నవి? 5. వేణు పాఠమును వ్రాయుచున్నాడు. 6. లాంతరు ఎచ్చట ఉన్నది? 7. టార్చి అచ్చట ఉన్నది. 8. అచ్చట కలములు ఉన్నవి, 9. గోవిందుని లాంతరు ఎక్కడ ఉన్నది? 10. విజయ పాఠమును వ్రాయుచున్నది.

## అభ్యాసము 2

2) ఈ క్రింది వాక్యములను తెలుగులో అనువదించండి.

1. ఘటే క్షీరమ్ అస్తి. 2. తత్ర ఛాత్రాః పఠన్తి. 3. అత్ర ఆపణాః సన్తి. 4. లవకుశౌ రామస్య పుత్రౌ. 5. లక్ష్మణశత్రుఘ్నభరతాః రామస్య సోదరాః 6. పాచకాః పాకం కుర్వన్తి. 7. రామస్య కలమః 8. భల్లూకౌ ఆగచ్ఛతః 9. ఛాత్రాః కుత్ర గచ్ఛన్తి? 10. గోవిన్దస్య తూలికా అత్ర అస్తి 11. పర్వతేషు సింహాః సన్తి, 12. కూపాః తత్ర సన్తి. 13. తత్ర బాలకౌ స్తః. 14. అత్ర ఛాత్రౌ స్తః.

# సంస్కృత పాఠమాల

## 3వ పాఠము

### ఇకారాంతపుంలింగము — హరి

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి | హరిః | హరీ | హరయః |
| సం. ప్ర. వి | హే హరే | హే హరీ | హే హరయః |
| ద్వి. వి. | హరిమ్ | హరీ | హరీన్ |
| తృ. వి. | హరిణా | హరిభ్యామ్ | హరిభిః |
| చ. వి. | హరయే | ,, | హరిభ్యః |
| పం. వి. | హరేః | ,, | ,, |
| ష. వి. | హరేః | హర్యోః | హరీణామ్ |
| స. వి. | హరౌ | ,, | హరిషు |

సూచన:- పై రూపములను కంఠస్థము చేయవలెను.

హరిః = హరి, హరీ = ఇద్దరు హరులు — —

హే హరే = ఓ హరీ! — — —

హరిమ్ = హరిని — — —

హరిణా = హరిచే - - - మున్నగు రూపములను ఊహింపుడు

నియమము:—

ఏ) శబ్దములో ర, ష, ఋ ల తర్వాత 'న' వున్నచో అది 'ణ' అగును.

ఉదా:- రామేణ; రామాణామ్, హరిణా; హరీణామ్, పురుషేణ మొ॥ అట్లు లేనిచో 'న' అట్లే ఉండును.

ఉదా:- కవినా; కపీనామ్; అగ్నినా, అగ్నీనామ్, కపినా మొ॥

బి) క ఖ గ ఘ ఙ, ప ఫ బ భ మ హ య, ఈ అక్షరములు రేఫము లేక షకారముతోగాని కలిసి వచ్చినచో దాని తుది అక్షరమైన 'న' 'ణ' అగును.

ఉదా:- అర్కేణ; కర్మణా; శర్మణా; శౌర్యేణ; ధైర్యేణ మొ॥

సూచన:- పై ణత్వవిధానము ప్రథమా ఏకవచనములోను షష్ఠీ బహువచనములోను వర్తించును.

పై నియమమును అనుసరించి క్రింది ఇకారాంత పుంలింగ శబ్దములను హరి శబ్దమువలె నడుపుడు —

1) రవిః (సూర్యుడు) 2) కవిః 3) అసిః (కత్తి) 4) మణిః 5) మునిః
6) అరిః (శత్రువు) 7) అలిః (తుమ్మెద) 8) అగ్నిః 9) ఋషిః

10) కపిః 11) కృమిః (క్రిమిః) = కీటకము 12) గిరిః (కొండ) 13) దాశరథిః 14) కుక్షిః (కడుపు) 15) సారథిః 16) రాశిః 17) మసిః (మసి) 18) నాభిః 19) యతిః 20) పాణిః 21) అతిథిః

4. **సర్వనామములు:** నామవాచకమునకు బదులుగా వాడబడు పదము.

ఉదా:– అతడు, వారు, ఆమె, అది మొ॥

సః = అతడు, అది సా = ఆమె, అది

అయం = ఇతడు, ఇది ఇయం = ఈమె, ఇది మొ॥

గమనింపుడు–

సః కవిః = అతడు కవి. సః ఋషిః = అతడు ఋషి.

సః వృక్షః = అది వృక్షము. సః పాచకః = అతడు వంటవాడు

అయం హరిః = ఇతడు హరి ఇయం సీతా = ఈమె సీత.

సః మణిం పశ్యతి = అతడు మణిని చూచుచున్నాడు.

సా మణీన్ పశ్యతి = ఆమె మణులను చూచుచున్నది.

సా కుత్ర గచ్ఛతి = ఆమె ఎక్కడకు వెళ్ళుచున్నది?

సూచన:- సంస్కృతములో వాక్యమందలి కర్త, కర్మ, క్రియలు వరుసగా నుండవలెనను నియమము లేదు. క్రియ ముందు వుండి కర్త తర్వాత వుండవచ్చును. వాక్యములో ఏ శబ్దము ఎచ్చటున్ననూ అర్థము చెడదు.

ఉదా:- సా కుత్ర గచ్ఛతి? కి బదులు 'కుత్రసా గచ్ఛతి' అనియో లేదా 'గచ్ఛతి కుత్ర సా?' అనియో చెప్పినసూ అర్థము మారదు.

## అభ్యాసము 1

తెలుగులో అర్థమును వ్రాయుము –

1) తత్ర రామస్య అరయః సన్తి. 2) సా పాఠం పఠతి 3) రమణః హరేః సోదరః 4) మణయః కుత్ర సన్తి? 5) ఇయం ఉటజే పాకం కరోతి 6) ఇయం రవిం పశ్యతి.

## అభ్యాసము 2

సంస్కృతములో వ్రాయుము –

1) ఆమె రాధ. 2) కవులు ఎచ్చటకు వెళ్ళుచున్నారు? 3) ఇది పురుగు; 4) ఇది గ్రామము 5) ఇది టార్చి 6) ఇది లాంతరు. 7) ఇది పెట్టె.

# సంస్కృతపాఠమాల

## 4వ పాఠము

ఉకారాంతపుంలింగము – గురు

| | | | |
|---|---|---|---|
| ప్ర. వి | గురుః | గురూ | గురవః |
| సం.ప్ర. వి | హే గురో | హే గురూ | హే గురవః |
| ద్వి. వి | గురుమ్ | గురూ | గురూన్ |
| తృ. వి | గురుణా | గురుభ్యామ్ | గురుభిః |
| చ. వి | గురవే | ,, | గురుభ్యః |
| పం. వి | గురోః | ,, | ,, |
| ష. వి | ,, | గుర్వోః | గురూణామ్ |
| స. వి | గురౌ | ,, | గురుషు |

గురుః = గురువు; గురూ = ఇద్దరు గురువులు; గురవః = బాలమంది గురువులు మున్నగు రూపములను ఊహింపుడు.

పై విధముగా ఈ క్రింది శబ్దములను నడుపుడు –

1) భిక్షు (బిచ్చగాడు) 2) అంశు (కిరణము) 3) అణు 4) అసు (ప్రాణము) 5) ఇన్దు (చంద్రుడు) 6) ఇషు (బాణము) 7) ఊరు (తొడ) 8) ఋతు 9) కేతు 10) జంతు 11) జిఘత్సు (ఆకలిగొన్నవాడు) 12) తన్తు (దారము) 13) తరు (చెట్టు) 14) దస్యు (దొంగ) 15) పటు (బలముగలవాడు) 16) పరశు (గొడ్డలి) 17) పశు 18) ప్రాంశు (పొడవైనవాడు) 19) ప్రభు 20) బన్ధు 21) బాహు 22) భాను 23) శంభు 24) మను 25) మన్యు (కోపము) 26) మరు (ఎడారి) 27) మృత్యు (చావు) 28) మృదు (మెత్తనిది) 29) మేరు 30) రాహు 31) రేణు 32) లజ్జాలు (సిగ్గుచెందువాడు) 33) వాయు 34) విధు (చంద్రుడు) 35) విభు (వ్యాపకుడు) 36) విష్ణు 37) వేణు 38) వేపథు (వణకు) 39) శత్రు 40) సహస్రాంశు (సూర్యుడు) 41) సాధు 42) సింధు (సముద్రము) 43) సూను (పుత్రుడు) 44) సేతు (వంతెన) 45) హేతు (కిరణము) 46) శిశు మొ॥

సూచన:- పై శబ్దములన్నియు ప్రాతిపదికములు. అనగా ప్రత్యయములు చేర్పుటకు ముందున్న రూపములు. వీనిని 'గురు' శబ్దమువలె భిక్షుః - భిక్షూ - భిక్షవః మున్నగు విధములుగా నడుపవలెను.

**కొన్ని అవ్యయములు:-** శీఘ్రం = త్వరగా; దూరం = దూరముగా; పునః = మరల; కతి = ఎన్ని? ఎంతమంది; కిం = ఏమి; అద్య = ఈరోజు

**కొన్ని సర్వనామములు:-** (పుంలింగములో) తౌ = వారు(ఇద్దరు) తే = వారు, అవి; ఏషః (అయం) = ఇతడు, ఇది; ఇమౌ (ఏతౌ) = ఈఇరువురు (ఈరెండు); ఏతే (ఇమే) = వీరు, ఇవి; అసౌ = వీడు, ఇది.

క్రింది వాక్యములను పరిశీలింపుడు –

తత్ర కతి తన్తవః సన్తి = అచట ఎన్ని దారము లున్నవి?
ఇమే రామాయణం పఠన్తి = వీరు రామాయణమును చదువుచున్నారు.
అయం మరుః = ఇది ఎడారి. తే పరశవః = అవి గండగొడ్డళ్ళు
అయం వసన్తఋతుః = ఇది వసంతఋతువు.
వాయునా పటం చలతి = వాయువుచే వస్త్రము కదులుచున్నది.
తత్ర సేతుః అస్తి = అచ్చట వంతెన గలదు. తే సాధవః = వీరు సాధువులు.
ఏషః కిం కరోతి? = ఇతడు ఏమి చేయుచున్నాడు.
తే ప్రభవః = వారు రాజులు.
దేవాలయే కతి జనాః సన్తి? = దేవాలయములో ఎందరు జనులున్నారు?
గురవః పాఠం బోధయన్తి = గురువులు పాఠమును బోధించుచున్నారు.
అద్య రామస్య సోదరః ఆగచ్ఛతి = ఈరోజు రాముని సోదరుడు వచ్చును
గోపాలః దూరం గచ్ఛతి = గోపాలుడు దూరముగా వెళ్ళుచున్నాడు.
మహేశః శీఘ్రం గృహంగచ్ఛతి-మహేశుడు త్వరగా ఇంటికి వెళ్ళుచున్నాడు
సః పునః ఆగచ్ఛతి – అతడు మరలా వచ్చుచున్నాడు.
ఏతే అన్నం ఖాదన్తి – వీరు అన్నం తినుచున్నారు.
ఏతౌ కిం కురుతః – వీరు (ఇద్దరు) ఏమి చేయుచున్నారు?
ఏతే గ్రన్థాః -- ఇవి గ్రంథములు.
ఇమౌ కిం లిఖతః – వీరిద్దరు ఏమి వ్రాయుచున్నారు?
పశవః కుత్ర చరన్తి? – పశువులు ఎక్కడ మేయుచున్నవి?

అభ్యాసము 1

తెలుగులో అర్థము వ్రాయండి –

1) అయః తరుః 2) గురుః పాఠం బోధయతి 3) ఆశ్రమే అద్య సాధుః ఆగచ్ఛతి. 4) గిరౌ పశవః చరన్తి. 5) అరణ్యే జన్తవః సన్తి.

అభ్యాసము 2

సంస్కృతములో అర్థము వ్రాయండి –

1) వారు శీఘ్రముగా వెళ్ళుచున్నారు. 2) విద్యార్థులు ఏమి చేయుచున్నారు? 3) ఈరోజు అతడు ఎచ్చటకు వెళ్ళును? 4) అతడు మరలా నీరు త్రాగుచున్నాడు. 5) పశువులు ఇచ్చట మేయుచున్నవి?



అధ్యాత్మజ్యోతి

సం॥ చందా రు. 20-00 లు విడిప్రతి రు. 2-00 లు

ఆజీవన చందా రు. 250-00 లు ధర్మపోషకులు రు. 2000/-

క్రింది అడ్రసుకు వ్రాయండి:

అధ్యాత్మప్రచారసేవాశ్రమము

శాంతినగరము, రాయదుర్గము - 515 865 (ఆంధ్రప్రదేశ్)

# సంస్కృత పాఠమాలా

## 5వ పాఠము

ఋకారాంతము – 'ధాతృ' బ్రహ్మ

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర | ధాతా | ధాతారౌ | ధాతారః |
| సం.ప్ర | ధాతః | ,, | ,, |
| ద్వి | ధాతారం | ,, | ధాతౄన్ |
| తృ | ధాత్రా | ధాతృభ్యామ్ | ధాతృభిః |
| చ | ధాత్రే | ,, | ధాతృభ్యః |
| పం | ధాతుః | ,, | ,, |
| ష | ధాతుః | ధాత్రోః | ధాతౄణామ్ |
| స | ధాతరి | ధాత్రోః | ధాతృషు |

ఇట్లు సవితృ (సూర్యుడు); భర్తృ (భర్త); నేతృ (నాయకుడు); దాతృ (ఇచ్చువాడు); కర్తృ (చేయువాడు); జేతృ (జయించువాడు); జ్ఞాతృ (తెలిసికొనువాడు); ద్రష్టృ (చూచువాడు); ధాతృ (ధరించువాడు లేక పోషించువాడు); శ్రోతృ (వినువాడు); స్రష్టృ (సృష్టికర్త); హన్తృ (చంపువాడు); మన్తృ (మననంచేయువాడు); ఘ్రాతృ (మూర్కొనువాడు); రసయితృ (రుచిగ్రహించువాడు) స్పర్శయితృ (తాకువాడు); గన్తృ (వెళ్ళువాడు); ఆగన్తృ (వచ్చువాడు); యన్తృ (సారథి) మొ॥ వాటిని నడపండి.

కొన్ని అవ్యయములు:- కదా? = ఎప్పుడు? సంప్రతి (ఇదానీం) = ఇప్పుడు; తదా (తదానీం) = అప్పుడు; సర్వదా (సదా) = ఎల్లపుడు సర్వత్ర = అంతట.

కొన్ని సర్వనామములు:- త్వం = నీవు; యువామ్ = మీరిద్దరు; యూయమ్ = మీరు; త్వామ్ = నిన్ను; యువామ్ = మీరిద్దరిని యుష్మాన్ = మిమ్ములను

క్రియలు:- వర్తమానకాలము - మధ్యమపురుషము

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| కరోషి = చేయుచున్నావు | కురుథః = మీరిద్దరు చేయుచున్నారు | కురుథ = చేయుచున్నారు |
| గచ్ఛసి = వెళ్ళుచున్నావు | గచ్ఛథః = మీరిద్దరు వెళ్ళుచున్నారు | గచ్ఛథ = మీరు వెళ్ళుచున్నారు |
| ఆగచ్ఛసి = వచ్చుచున్నావు | ఆగచ్ఛథః = మీరిద్దరు వచ్చుచున్నారు | ఆగచ్ఛథ = మీరు వచ్చుచున్నారు |
| లిఖసి = వ్రాయుచున్నావు | లిఖథః = మీరిద్దరు వ్రాయుచున్నారు | లిఖథ = మీరు వ్రాయుచున్నారు |
| ఖాదసి = తినుచున్నావు | ఖాదథః = మీరిద్దరు తినుచున్నారు | ఖాదథ = మీరు తినుచున్నారు |
| తోలయసి = తూచుచున్నావు | తోలయథః = మీరు ఇద్దరు తూచుచున్నారు | తోలయథ = మీరు తూచుచున్నారు |
| పఠసి = చదువుచున్నావు | పఠథః = మీరిద్దరు చదువుచున్నారు | పఠథ = మీరు చదువుచున్నారు |
| పశ్యసి = చూచుచున్నావు | పశ్యథః = మీరు ఇద్దరూ చూచుచున్నారు | పశ్యథ = మీరు చూచుచున్నారు |
| అసి = ఉన్నావు | స్థః = మీరిద్దరున్నారు | స్థ = మీరున్నారు |
| భవసి = అగుచున్నావు ఉన్నావు | భవథః = మీరిద్దరు అగుచున్నారు మీరిద్దరు ఉన్నారు | భవథ = మీరు అగుచున్నారు మీరు ఉన్నారు |

క్రింది వాక్యములను పరిశీలింపుడు -

త్వం కిం కరోషి? - నీవు ఏమి చేయుచున్నావు?
యువాం కిం కురుథః? - మీరిద్దరు ఏమి చేయుచున్నారు?
యూయం కిం కురుథ? - మీరు ఏమి చేయుచున్నారు?
త్వం కుత్ర గచ్ఛసి? - నీవు ఎక్కడకు వెళ్ళుచున్నావు?

యూయం అత్ర కిం పఠథ? – మీరు ఇచ్చట ఏమి చదువుచున్నారు?
త్వం శర్కరాం తోలయసి – నీవు చక్కెరను తూచుచున్నావు.
యూయం గ్రన్థాన్ పశ్యథ – మీరు గ్రంథమును చూచుచున్నారు.
త్వం కుత్ర అసి? – నీవు ఎక్కడ ఉన్నావు?
యూయం అత్ర స్థ – మీరు ఇక్కడ ఉన్నారు.
యుష్మాన్ పృచ్ఛామి – మిమ్ములను అడుగుచున్నాను.
మాతా త్వాం పశ్యతి – తల్లి నిన్ను చూచుచున్నది.
త్వం కదా ఆగచ్ఛసి? – నీవు ఎప్పుడు వచ్చెదవు?
ఆకాశే సవితా అస్తి – ఆకాశములో సూర్యుడు ఉన్నాడు
ప్రపఞ్చస్య ధాతా పరమేశ్వరః–ప్రపంచమునకు రక్షకుడు పరమేశ్వరుడు
హే ధాతః, త్వం స్రష్టా – ఓ ధాత, నీవు సృష్టికర్తవు
ఏతే అత్ర ఆగన్తారః – వీరు ఇచ్చటికి వచ్చినవారు
ఏషః కర్తా – ఇతడు కర్త. అయం దాతా – ఇతడు దాత
సః ఇదానీం కుత్ర అస్తి? – అతడు ఇపుడు ఎచ్చట ఉన్నాడు?
దేవః సర్వదా జనాన్ రక్షతి–భగవంతుడు ఎల్లపుడు జనులను రక్షించును
తదా (నీం) త్వం కిం వదసి? – అపుడు నీవు ఏమి చెప్పెదవు?
త్వం సంప్రతి కిం పఠసి? – ఇపుడు నీవు ఏమి చదువుచున్నావు?
యన్తా అశ్వాన్ చోదయతి – సారథి గుఱ్ఱములను తోలుచున్నాడు

## అభ్యాసము 1

అనువదింపుడు –

1) త్వం పత్రం లిఖసి. 2) యూయం గుడం ఖాదథ. 3) ధాతరి దోషః నాస్తి. 4) దేవః ప్రపఞ్చస్య స్రష్టా. 5) త్వం శ్రోతా. 6) దేవః దాతారం రక్షతి.

## అభ్యాసము 2

సంస్కృతంలో వ్రాయండి –

1) దేవుడు అంతట ఉన్నాడు. 2) ఇపుడు నీవు వ్రాయుచున్నావు. 3) మీరిద్దరు ఎప్పుడు చదువుదురు? 4) అతడు మిమ్ములను చూచుచున్నాడు.

# సంస్కృత పాఠమాలా

## 6వ పాఠము

ఋకారాంత పుంలింగము – పితృ (తండ్రి)

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర. వి. | పితా | పితరౌ | పితరః |
| సం. వి | హేపితః | హేపితరౌ | హేపితరః |
| ద్వి. వి | పితరమ్ | పితరౌ | పితౄన్ |

తక్కినవి ధాతృశబ్దమువలె

పితా = తండ్రి; పితరౌ = ఇరువురు తండ్రులు, పితరః = చాలమంది తండ్రులు మున్నగు విధముల ఆయా విభక్తులలో అర్థమును గ్రహించునది. పితృశబ్దమువలె జామాతృ (అల్లుడు), భ్రాతృ (సోదరుడు), సవ్యేష్టృ (సారథి) మొదలగువాటిని పితృ శబ్దమువలె నడుపండి.

ఈ క్రింది వాక్యములను పరిశీలింపుడు–

తవ పితా కః = నీ తండ్రి ఎవరు?
దశరథః రామస్య పితా = దశరథుడు రాముని తండ్రి.
తే బాలకానాం పితరః = వారు బాలకుల తండ్రులు.
సః పితరం నమతి = అతడు తండ్రికి నమస్కరిస్తున్నాడు.
రామః జనకస్య జామాతా = రాముడు జనకుని అల్లుడు.
తస్య పితరి దోషః నాస్తి = అతని తండ్రిలో దోషము లేదు.
అయం తవ భ్రాతా = ఇతడు నీ సోదరుడు.
సా భ్రాతరం పశ్యతి = ఆమె సోదరుని చూచుచున్నది.
ఏషః రథస్య సవ్యేష్టా = ఇతడు రథముయొక్క సారథి.
పార్వతీపరమేశ్వరౌ ప్రపఞ్చస్య పితరౌ = పార్వతీపరమేశ్వరులు ప్రపంచమునకు తల్లిదండ్రులు (పితరౌ = తల్లిదండ్రులు అనికూడ అర్థము)

రామః పుస్తకం పిత్రే దదాతి = రాముడు పుస్తకమును తండ్రికి ఇచ్చుచున్నాడు.

ఇదం రామస్య పిత్రా లిఖితం పత్రమ్ = ఇది రాముని తండ్రిచే వ్రాయబడిన జాబు.

లక్ష్మణభరతశత్రుఘ్నాః రామస్య భ్రాతరః = లక్ష్మణభరతశత్రుఘ్నులు రాముని సోదరులు.

జామాతా దశమో గ్రహః = అల్లుడు పదియవ గ్రహము.

**నియమము** - ఒక వ్యక్తి ఎక్కడికి వెళ్ళుచున్నాడో లేక వచ్చుచున్నాడో ఆ స్థలమును తెలుపు శబ్దము మన తెలుగులో షష్ఠీవిభక్తిలో వుండును. కాని సంస్కృతములో ద్వితీయా విభక్తిలో ఉండును –

ఉదా॥ రాముడు దేవాలయమునకు వెళ్ళుచున్నాడు.

ఇచట రాముడు ఎచటికి వెళ్ళుచున్నాడో ఆ స్థలమును తెలిపెడు 'దేవాలయమునకు' అను శబ్దము షష్ఠీవిభక్తిలో ఉన్నది. దీనిని సంస్కృతములో 'రామః దేవాలయస్య గచ్ఛతి' అని చెప్పరాదు. 'దేవాలయః' అను శబ్దమును ద్వితీయావిభక్తిలో మార్చుకొని, 'దేవాలయం' అని అనగా 'రామః దేవాలయం గచ్ఛతి' అని చెప్పవలెను.

ఈ క్రింది వాక్యములను గమనించండి –

గోపాలః గృహం గచ్ఛతి = గోపాలుడు ఇంటికి వెళ్ళుచున్నాడు.
కృషీవలః ఆరామం గచ్ఛతి = రైతు తోటకు వెళ్ళుచున్నాడు.
భక్తః గీతామన్దిరం గచ్ఛతి = భక్తుడు గీతామందిరమునకు వెళ్ళుచున్నాడు.
కర్మకరః ఉటజమ్ అగచ్ఛతి = కార్మికుడు కుటీరమునకు వచ్చుచున్నాడు.
అధికారీ కార్యాలయమ్ (ఆ) గచ్ఛతి = ఆఫీసరు ఆఫీసుకు పోవు (వచ్చు) చున్నాడు.

**నియమము** - ఏదేని ఒక వస్తువును ఏ వ్యక్తికి ఇవ్వదలచితిమో ఆ వ్యక్తిని తెలుపుపదము తెలుగులో సామాన్యముగా షష్ఠీవిభక్తిలో ఉండును.

కాని సంస్కృతములో చతుర్థీవిభక్తిలో ఉండవలెను. ఉ॥ తండ్రి కుమారునకు పుస్తకమును ఇచ్చుచున్నాడు. ఈ వాక్యములో 'కుమారునకు' అను పదము షష్ఠిలో ఉన్నది. కాని సంస్కృతములో 'పితా పుత్రాయ పుస్తకం దదాతి' అన్నపుడు 'పుత్రాయ' అని చతుర్థిలో ప్రయోగింతురు. పితా పుత్రస్య పుస్తకం దదాతి. అని చెప్పితే తప్పు.

గమనించండి –

అర్చకః భక్తాయ తీర్థం దదాతి = పూజారి భక్తునకు తీర్థము నిచ్చుచున్నాడు
రామః హరయే ఫలాని యచ్ఛతి = రాముడు హరికి ఫలములను ఇచ్చుచున్నాడు.
ధేనుః వత్సాయ దుగ్ధం దదాతి = ఆవు దూడకు పాల నిచ్చును.
గోపాలః మోహనాయ కలమం దదాతి = గోపాలుడు మోహనునకు కలము నిచ్చును.
సీతా శునకాయ అపూపం యచ్ఛతి = సీత కుక్కకు రొట్టె నిచ్చుచున్నది.
మాతా శిశవే క్షీరం దదాతి = తల్లి శిశువుకు పాల నిచ్చుచున్నది.
బాలకాయ దుగ్ధం దేహి = బాలకునకు పాల నిమ్ము.
పరివ్రాజకాయ భిక్షాం దేహి = సన్న్యాసికి భిక్ష పెట్టుము.

సంస్కృతములో అనువదింపుడు

1. విప్రులు దేవాలయమునకు వెళ్ళుచున్నారు. 2. నా తండ్రి ఇంటికి వచ్చుచున్నాడు. 3. అర్జునుడు ద్రుపదునకు అల్లుడు. 4. బాలకుడు తండ్రికి నమస్కరించుచున్నాడు.

వాక్యములను సరిదిద్దుము –

1. మాతా పుత్రస్య ఫలం దదాతి. 2. గోపాలః చలచ్చిత్రాలయస్య (సినిమాకు) గచ్ఛతి. 3. రమా బాలకస్య అపూపం యచ్ఛతి. 4. రోగీ వైద్యాలయస్య గచ్ఛతి. 5. విఠలః ఆశ్రమస్య ఆగచ్ఛతి. 6. సః గ్రామస్య గచ్ఛతి.

# సంస్కృత పాఠమాలా

## 7వ పాఠము

శ్రీ పి. లక్ష్మీకాంతశర్మ

ఓకారాంతము – 'గో' శబ్దము – ఎద్దు లేక ఆవు
(ఇది పుంలింగమందును స్త్రీలింగమందును వర్తించును)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి | గౌః | గావౌ | గావః |
| సం. ప్ర | గౌః | ,, | ,, |
| ద్వి. వి | గామ్ | ,, | గాః |
| తృ. వి | గవా | గోభ్యామ్ | గోభిః |
| చ. వి | గవే | ,, | గోభ్యః |
| పం. వి | గోః | ,, | ,, |
| ష. వి | ,, | గవోః | గవామ్ |
| స. వి. | గవి | ,, | గోషు |

గౌః = ఒక ఎద్దు లేక ఒక ఆవు. గావౌ — రెండు ఎద్దులు లేక రెండు ఆవులు. గావః = చాల ఎద్దులు, చాలా ఆవులు– ఇట్లే ఇతర విభక్తులలోను గ్రహించునది.

కొన్ని సర్వనామములు:- తే = వారు [ద్వివచనము స్త్రీలింగములో] తాః = వారు [బహువచనము – స్త్రీలింగములో]; ఇమాః = వీరు; ఇవి [స్త్రీలింగము బహువచనము]

క్రింది వాక్యములను గమనింపుడు —

అయం గౌః = ఇది ఎద్దు. ఇయం గౌః = ఇది ఆవు.
సః గాః చోదయతి = అతడు ఎద్దులను తోలుచున్నాడు.
ఇమే గాః చోదయన్తి = వీరు గోవులను మేపుచున్నారు.
తత్ర గావః తృణం చరన్తి. = అచ్చట గోవులు మేయుచున్నవి.

గవే తృణం దేహి = గోవుకు గడ్డి నిమ్ము.
గవే నమః = గోవుకు నమస్కారము.
గోః క్షీరం మధురం భవతి = ఆవు పాలు తీయగా వుండును.
గవి సాత్త్వికతా అస్తి = గోవులో సత్త్వగుణము ఉన్నది.
ఏషః గవాం చారకః = ఇతడు గోవుల మేపువాడు.
సర్వోపనిషదః గావః = సర్వోపనిషత్తులు గోవులు.
గౌః దుగ్ధం దదాతి = గోవు పాల నిచ్చును.
గోవిన్దః గవాం పాలకః = గోవిందుడు గోవుల రక్షకుడు.
గౌః సాధుజన్తుః = గోవు సాధుజంతువు.
తాః గావః = అవి గోవులు. తే గావౌ = అవి (రెండు) గోవులు
తాః బాలికాః = వారు బాలికలు. ఇమాః గావః = ఇవి గోవులు.
రామః గాం నమతి = రాముడు గోవుకు నమస్కరిస్తున్నాడు.
గావః పశ్యన్తి గన్ధేన = గోవులు గంధముతో చూచును (పసిగట్టును)
గౌః వత్సాయ దుగ్ధం దదాతి = గోవు దూడకు పాల నిచ్చును.

**నియమము:-** ఎవరికి నమస్కరించెదమో ఆ వ్యక్తిని తెలుపు పదము సంస్కృతములో ద్వితీయావిభక్తిలో ఉండవలెను. కాని తెనుగులో షష్ఠీ విభక్తిలో ఉండును.

ఉదా:- సః రామం నమతి = అతడు రామునకు నమస్కరించును.
పితరం నమతి = తండ్రికి నమస్కరించుచున్నాడు.
వన్దే మాతరం = తల్లికి నమస్కరించుచున్నాను.
గాః నమన్తి = గోవులకు నమస్కరించుచున్నారు.
త్వం దేవం నమసి = నీవు దేవునకు నమస్కరించుచున్నావు.

**నియమము:-** కాని 'నమస్కారము' అను అర్థమునిచ్చు 'నమః' అను అవ్యయమును వాడునపుడు చతుర్థీవిభక్తి ఉండవలెను.

ఉదా:- కృష్ణాయ నమః = కృష్ణునకు నమస్కారము.
గురవే నమః = గురువునకు నమస్కారము.

శంభవే నమః = శంభువుకు నమస్కారము.
(ఓం) నమః శివాయ = శివునకు నమస్కారము
(ఓం) నమో నారాయణాయ = నారాయణునకు నమస్కారము.

మరికొన్ని సర్వనామములు- అహం = నేను: ఆవాం = మన- మిరువురము; వయం = మేము, మనము.

కొన్ని క్రియలు- వర్తమానకాలము- ఉత్తమపురుషము.

| ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|
| పఠామి = చదువుచున్నాను | పఠావః = ఇరువురు చదువుచున్నాము | పఠామః = చదువుచున్నాము |
| గచ్ఛామి = వెళ్ళుచున్నాను | గచ్ఛావః = ఇరువురము వెళ్ళుచున్నాము | గచ్ఛామః = వెళ్ళుచున్నాము |
| లిఖామి = వ్రాయుచున్నాను | లిఖావః = ఇరువురము వ్రాయుచున్నాము | లిఖామః- వ్రాయుచున్నాము |
| ఖాదామి-తినుచున్నాను | ఖాదావః-ఇరువురము తినుచున్నాము | ఖాదామః-తినుచున్నాము |
| పశ్యామి-చూచుచున్నాను | పశ్యావః-చూచుచున్నాము | పశ్యామః-చూచుచున్నాము |
| కరోమి-చేయుచున్నాను | కుర్వః-చేయుచున్నాము | కుర్మః-చేయుచున్నాము |

క్రింది వాక్యములను గమనింపుడు —

అహం రామాయణం పఠామి – నేను రామాయణమును చదువుచున్నాను
అహం పత్రం లిఖామి – నేను జాబు వ్రాయుచున్నాను.
అహం దేవాలయం గచ్ఛామి – నేను గుడికి వెళ్ళుచున్నాను.
వయం చిత్రం పశ్యామః – మేము చిత్రమును చూచుచున్నాము.
ఆవాం గృహం గచ్ఛావః – మేము (ఇద్దరము) ఇంటికి వెళ్ళుచున్నాము.
వయం గీతాం పఠామః – మేము గీతను చదువుచున్నాము.

త్వం కుత్ర గచ్ఛసి? అహం ఆరా ం ఛమి – నీవు ఎక్కడకు వెళ్ళు చున్నావు? నేను తోటకు వెళ్ళుచున్నాను.

అహమ్ ఆత్మా గుడాకేశ – గుడాకేశ! నేను ఆత్మను.

### అభ్యాసము 1

సంస్కృతములో అనువదింపుడు –

1. తండ్రికి నమస్కారము: 2. సూర్యునకు నమస్కరించుచున్నాను.
3. సృష్టికర్తకు నమస్కారము. 4. మేము గోవులకు నమస్కరిస్తున్నాము

### అభ్యాసము 2

తెలుగులో వ్రాయుము –

1. వయం గురూన్ నమామః 2. ఆదికవయే నమః 3. గావః వనే చరన్తి. 4. వయం గ్రామం గచ్ఛామః 5. గోషు క్షీరమ్ అస్తి.

### అభ్యాసము 3

సవరింపుడు –

1) దేవస్య నమః 2) శివస్య నమః 3) అహం రామం నమసి.
4) వయం గృహం గచ్ఛామి 5) శునకః కుత్ర గచ్ఛసి?

---

## నల్లులమంచం

ఈ ప్రపంచం ఒక నల్లుల మంచం. ఈ మంచంపై పడుకొన్నవానికి నిద్రపట్టదు. దుస్సంకల్పాలే నల్లులు. ఇవి కుట్టి లేపును. మందువేసి మంచంలోని నల్లులను పోగొట్టవచ్చు. కాని దుర్వాసనలనే నల్లులు బయట లేవు. అవి హృదయంలో వున్నాయి. సాక్షిస్వరూపంలో నిలిస్తేనే వాటి బాధ వుండదు.

---

# సంస్కృతపాఠమాలా

## 8వ పాఠము

శ్రీ పి. లక్ష్మీకాంతశర్మ

అకారాంతము – నపుంసకలింగము – ఫల (పండు)

| | | | |
|---|---|---|---|
| ప్ర.వి. | ఫలమ్ | ఫలే | ఫలాని |
| సం.ప్ర.వి. | హేఫల | హేఫలే | హేఫలాని |
| ద్వి.వి. | ఫలం | ఫలే | ఫలాని |

మిగిలినది రామ శబ్దమువలె నడుపుడు.

పై విధముగనే ఈ క్రింది అకారాంత నపుంసకలింగ శబ్దములకు రూపములను ఊహింపుడు –

మిత్ర; కళత్ర (భార్య); ఉదర (కడుపు); ఋణ (అప్పు); ఇన్ద్రియ; శరీర; ఆసన; కనక; కారణ; గగన; ఆకాశ; గీత (పాట); గోత్ర; ఘృత (నేయి); గృహ; చరిత (చరిత్ర); జల; చిత్ర; తల్ప, ధన, నగర, క్షీర, శ్రోత్ర; ఘ్రాణ; నేత్ర; రహస్య; ప్రమాణ; దిన; మూల్య; పత్ర; పుష్ప; భాగ్య; యన్త్ర; రన్ధ్ర; సలిల; సాధన; శరణ; ప్రస్థాన; శైత్య (జలుబు); ప్రయాణ; శయన; సుఖ; దుఃఖ; హిరణ్య (బంగారు); ముఖ; వన: తృణ; కాగిత, చక్ర, పుస్తక, ప్రజ్ఞాన (శుద్ధమైన తెలివి), జ్ఞాన (తెలివి), చైతన్య; సూత్ర; (దారము) క్షేత్ర(శరీరము, భూమి, భార్య, పుణ్య భూమి),ద్వార (వాకిలి), భారత; రామాయణ; పురాణ; రూప; భయ; భవితవ్య (అదృష్టము), విష, అమృత, భూత (ఆకాశము మున్నగు పంచభూతములు) భువన (భూమి), భవన, కావ్య, భాష్య, వ్యాఖ్యాన, వార్తిక, శాస్త్ర, కార్య; కుల; బ్రహ్మసూత్ర; రజత; రూప్యక (రూపాయ), అన్నం: వ్రతం; మున్నగునవి.

ఈ వాక్యములను పరిశీలింపుడు –

| | |
|---|---|
| ఇదం కిమ్? = ఎది ఎమి? | ఇదం పుస్తకమ్ = ఇది పుస్తకము, |
| ఏతత్ కిమ్? = ఇది ఏమి? | ఇదం పుష్పమ్ = ఇది పువ్వు. |

| | |
|---|---|
| తత్ కిమ్? = అది ఏమి? | తత్ ఫలమ్ = అది పండు. |
| తాని కాని? = అవి ఏవి? | తాని చిత్రాణి = అవి చిత్రములు. |
| తే కే? = అవి ఏవి? | తే ఆసనే = అవి (రెండు) ఆసనములు. |
| ఏతాని కాని? / ఇమాని కాని? — ఇవి ఏవి? | ఏతాని చక్రాణి / ఇమాని చక్రాణి — ఇవి చక్రములు |
| ఏతే కే? / ఇమే కే? — ఇవి ఏవి?(ద్వి) | ఏతే భవనే / ఇమే భవనే — ఇవి రెండు భవనములు |

సీతా రామస్య కళత్రమ్ = సీత రాముని భార్య.

జటాయుః దశరథస్య మిత్రమ్ = జటాయువు దశరథుని మిత్రుడు

ఇన్ద్రియాణి ప్రమాథీని = ఇంద్రియములు విక్షేపము కలిగించునవి.

పాత్రే ఘృతమ్ అస్తి = పాత్రలో నేయి ఉన్నది.

ఆయుర్వై ఘృతమ్ = నేయి ఆయుస్సు.

రామస్య చరితం పవిత్రమ్ = రాముని చరిత్ర పవిత్రమైనది.

ఇమాని శంకరభాష్యాణి = ఇవి శంకరభాష్యములు.

ఇదం సురేశ్వరాచార్యాణాం వార్తికమ్ = ఇది సురేశ్వరాచార్యుల వార్తికము.

మామ్ ఏకం శరణం వ్రజ = నన్నొక్కనినే (దేవుని)శరణుబొందుము.

ఇదం సాధనప్రస్థానమ్ = ఇది సాధన ప్రస్థానము.

తవ గృహం కుత్ర అస్తి? = నీ ఇల్లు ఎక్కడ ఉన్నది?

మమ గృహం నగరే అస్తి = నా ఇల్లు నగరములో ఉన్నది.

న గృహం గృహమ్ ఇతి ఆహుః గృహిణీ గృహమ్ ఉచ్యతే = గృహము గృహమని చెప్పరు; గృహిణియే (భార్య) గృహము.

ప్రజ్ఞానం బ్రహ్మ = ప్రజ్ఞానము బ్రహ్మము.

ఆయుః నశ్యతి దివే దినే = రోజు రోజుకు ఆయువు నశించుచున్నది.

చక్రవత్ పరివర్తన్తే దుఃఖాని చ సుఖాని చ = సుఖదుఃఖములు చక్రములవలె తిరుగుచున్నవి.

సాధనేన సిద్ధిః = సాధనవలన సిద్ధి.

ప్రమా కరణం ప్రమాణమ్ = ప్రమకు (సరియైన తెలివికి) సాధనము ప్రమాణము.

శాస్త్రం తు అన్త్యం ప్రమాణమ్ = శాస్త్రము కడపటి ప్రమాణము.
కిం తే గోత్రమ్? = నీ గోత్రమేమి? కిం తే కులమ్? = నీ కుల మేది?
ప్రపఞ్చస్య కారణం కిమ్? = ప్రపంచమునకు కారణమేమి?
ఋణం కృత్వా ఘృతం పిబేత్ ఇతి నాస్తికానాం జీవనసూత్రమ్ = అప్పుచేసి నేయి త్రాగవలెననుట నాస్తికుల జీవనసూత్రము.
ముముక్షుః బ్రహ్మసూత్రాణి పఠతి = ముముక్షువు బ్రహ్మసూత్రములను చదువుచున్నాడు.
ఇదం శరీరం కౌన్తేయ క్షేత్రమ్ = కుంతీపుత్ర! ఈ శరీరము క్షేత్రము
శరీరమ్ ఆద్యమ్ ఖలు ధర్మసాధనమ్ = శరీరమును మొదట(చూసుకొని) పిమ్మట ధర్మసాధన చేయవలెను.
విశ్వశ్రేయః కావ్యమ్ = కావ్యము విశ్వమునకు మేలు కలిగించునది.
రామాయణమ్ ఆదికావ్యమ్ = రామాయణము ఆదికావ్యము.
భారతం పఞ్చమో వేదః = భారతము ఐదవ వేదము.
పురాణం పఞ్చలక్షణమ్ = పురాణము ఐదు లక్షణములు గలది.
న శరీరం పునః పునః = (మానవ) శరీరము మరల మరల రాదు.
న భయం చాస్తి జాగ్రతః = హెచ్చరికగలవానికి భయము లేదు.
న దయా సదృశం జ్ఞానమ్ = దయతో సమానమైన జ్ఞానము లేదు.
అశాన్తస్య కుతః సుఖమ్ = శాంతి లేని వానికి సౌఖ్యము లేదు.
నివృత్తరాగస్య గృహం తపోవనమ్ = రాగము లేని వానికి గృహమే తపోవనము.
అనభ్యాసే విషం శాస్త్రమ్। అజీర్ణే భోజనం విషమ్॥ = అభ్యసింపకపోతే శాస్త్రము విషము; అజీర్ణముగలవానికి భోజనము విషము.
శ్రోత్రస్య భూషణం శాస్త్రమ్ = చెవికి శాస్త్రమే అలంకారము.
ఆలస్యాత్ అమృతం విషమ్—ఆలస్యమైతే అమృతము విషమగును.
వేదస్య ముఖం వ్యాకరణమ్—వేదమునకు వ్యాకరణమే ముఖము.
తేన వినా తృణమపి న చలతి—అతడు (ఈశ్వరుడు) లేనిదే గడ్డిపోచ కూడ కదలదు.
అనిత్యాని శరీరాణి—శరీరములు అనిత్యములు.

# సంస్కృత పాఠమాలా
## 9వ పాఠము

---

ఇకారాంత నపుంసకలింగము 'వారి' (జలము)

| | | | |
|---|---|---|---|
| ప్ర. వి. | వారి | వారిణీ | వారీణి |
| సం. ప్ర వి. | హేవారే, హేవారి | హేవారిణీ | హేవారీణి |
| ద్వి. వి. | వారి | వారిణీ | వారీణి |
| తృ. వి. | వారిణా | వారిభ్యామ్ | వారిభిః |
| చ. వి. | వారిణే | వారిభ్యామ్ | వారిభ్యః |
| ప. వి. | వారిణః | వారిభ్యామ్ | వారిభ్యః |
| ష. వి. | వారిణః | వారిణోః | వారీణామ్ |
| స. వి. | వారిణి | వారిణోః | వారిషు |

క్రింది ఉదాహరణలు గమనించండి.

అహం వారి పిబామి = నేను నీరు త్రాగుచున్నాను.
వారి ఆనయ = జలము తెమ్ము.
వారిణి దోషో నాస్తి = నీటిలో దోషము లేదు.
తస్మిన్ కూపే వారి నాస్తి = ఆ బావిలో నీరు లేదు.
న వారిణా శుధ్యతి చాన్తరాత్మా=నీళ్ళచే మనస్సు శుద్ధము కాదు.
వారిణా భూమిః పచ్యతే = జలముచే భూమి పక్వము చేయబడును.
వారిణః రసః ముఖ్యః గుణః=నీటికి రసము ముఖ్య గుణము.

ఇకారాంత నపుంసకలింగము 'శుచి' (శుద్ధి)

| | | | |
|---|---|---|---|
| ప్ర వి. | శుచి | శుచినీ | శుచీని |

తృతీయవరకు 'వారి' వలె నడపవలెను.

| | | | |
|---|---|---|---|
| చ. వి. | శుచినే, శుచయే | శుచిభ్యామ్ | శుచిభ్యః |
| ప. వి. | శుచినః, శుచేః | శుచిభ్యామ్ | శుచిభ్యః |
| ష. వి. | ,, ,, | శుచినోః, శుచ్యోః | శుచీనామ్ |
| స. వి. | శుచిని, శుచౌ | శుచినోః, శుచ్యోః | శుచిషు |

గమనింపుడు –

శుచి జలమ్ = శుద్ధమైన జలము.
సః శుచి వస్త్రం ధారయతి = అతడు శుభ్రమైన వస్త్రమును ధరించును.
శుచీని వస్త్రాణి = శుభ్రమైన వస్త్రములు.
శుచి వస్త్రం ధారయ = శుభ్రమైన వస్త్రమును ధరింపుము.
జలం శుచి వివిక్తస్థమ్ = ఏకాంతమందలి జలము శుచిగా వుండును.
శుచి జలం పిబ = శుభ్రమైన నీటిని త్రాగుము.
సః శుచి జలం ఆనయతి = అతడు శుభ్రమైన నీటిని తెచ్చును.
సా శుచౌ స్థలే అన్నం పచతి = ఆమె శుచియైన స్థలమున వండుచున్నది

ఉకారాంత నపుంసకలింగము 'మధు' తియ్యనిది లేక తేనె.

| | | | |
|---|---|---|---|
| ప్ర. వి. | మధు | మధునీ | మధూని |
| సం.ప్ర.వి. | హే మధో, హే మధు | హే మధునీ | హే మధూని |
| ద్వి. వి. | మధు | మధునీ | మధూని |
| తృ. వి. | మధునా | మధుభ్యామ్ | మధుభిః |
| చ. వి. | మధునే | ,, | మధుభ్యః |
| ప. వి. | మధునః | ,, | ,, |
| ష. వి. | ,, | మధునోః | మధూనామ్ |
| స. వి. | మధుని | మధునోః | మధుషు |

పై విధముగనే అమ్బు (నీరు); జత్రు (మూపులయొక్క సంధి ఎముకలు); శ్మశ్రు (గడ్డము మీసమును)

కాని 'మృదు' శబ్దము ప్రథమావిభక్తినుండి తృతీయ వరకు మధు శబ్దమువలె నడచును. తర్వాత కొన్ని చోట్ల క్రింది విధముగా రెండు రూపములు కలవు.

| | | | |
|---|---|---|---|
| చ. వి. | మృదునే, మృదవే | మృదుభ్యామ్ | మృదుభ్యః |
| ప. వి. | మృదునః, మృదోః | ,, | ,, |
| ష. వి. | ,, ,, | మృదునోః, మృద్వోః | మృదూనామ్ |
| స. వి. | మృదుని, మృదౌ | మృదునోః మృద్వోః | మృదుషు |

గమనింపుడు –

సః మధు ఖాదతి = అతడు తేనె తినుచున్నాడు.

మధూని ఫలాని తత్ర సన్తి అచట తియ్యని పళ్ళు కలవు.

మృదూని వచనాని = మృదువైన మాటలు.

మృదూని వస్త్రాణి = మృదువైన వస్త్రములు.

అమ్బుని కమలం జాయతే = నీటిలో కమలము పుట్టును.

### అభ్యాసము 1

సంస్కృతములో వ్రాయుము–

1. చెంబులో నీరు తెమ్ము. 2. బావిలో నీరు ఉన్నది.
3. ఈ జలములో మాలిన్యము (మాలిన్యం) ఉన్నది.
4. గోపాలుడు శుభ్రమైన వస్త్రమును ధరించుచున్నాడు.
5. ఇది శుచియైన ఇల్లు.



## అనాత్మ అంటే ఏది?

'బ్రహ్మజ్ఞకవి' శ్రీ దేవరాయకులకర్ణిస్వాములవారు, బెంగుళూరు.

ఇది ఒక పాశ్చాత్యవిద్యార్థికినీ శ్రీ గురుదేవులవారికినీ జరిగిన సంవాదం–

విద్యార్థి:- స్వామీజీ, అనాత్మ అంటే ఏది?

శ్రీవారు:- ఆత్మస్వరూపాన్ని బాగా తెలియనప్పుడు ఆ స్వరూపమే అనాత్మ వలె తోస్తుంది. నిజంగా ఆత్మకంటె వేరైన అనాత్మ అనే తత్త్వం లేనేలేదు.

"న చ అనాత్మసన్ సర్వం ఆత్మైవ భవతి కస్యచిత్ । తస్మాత్ అవిద్యయైవ అనాత్మత్వం పరికల్పితం న తు పరమార్థతః ఆత్మ వ్యతిరేకేణ అస్తి కించిత్ ॥ (బృ. 2-4-14) అవిద్య బుద్ధిలో వున్నపుడు ఆత్మయే అనాత్మలా కనిపిస్తుంది. నిజంగా ఆత్మ ఒక్కటే ఉంది. ఆత్మనే అవిద్యతో అనాత్మ అంటున్నాం· అంతే!



# సంస్కృత పాఠమాలా

## 10వ పాఠము

అకారాంత స్త్రీ లింగము – లతా (తీగ

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి. | లతా | లతే | లతాః |
| సం.ప్రవి. | హే లతే | హే లతే | హే లతాః |
| ద్వి.వి | లతామ్ | లతే | లతాః |
| తృ.వి. | లతయా | లతాభ్యామ్ | లతాభిః |
| చ.వి. | లతాయై | లతాభ్యామ్ | లతాభ్యః |
| ప.వి. | లతాయాః | ,, | ,, |
| ష.వి. | ,, | లతయోః | లతానామ్ |
| స.వి. | లతాయామ్ | ,, | లతాసు |

పై శబ్దమువలె క్రింది శబ్దములకు రూపములను వ్రాయండి–

రమా (లక్ష్మి), ఆజ్ఞా, ఇచ్ఛా, గఙ్గా, చిన్తా, ఛాయా, జనతా, దశా, పత్రికా, బాలికా, పేటికా (పెట్టె), పతాకా, భాషా, యాత్రా, మాలా, లజ్జా, వసుధా, (భూమి), శోభా, సీతా, సేనా, గీతా, చేతనా (ఎరుక), శర్కరా(చక్కెర), సేవా, మొ॥

క్రింది వాక్యములను గమనించండి —

ఇయం ఉమా = ఈమె ఉమా. ఇయం పేటికా = ఇది పెట్టె.
ఇయం మాసపత్రికా = ఇది మాసపత్రిక.
యా మా సా మాయా = ఏది లేదో అది మాయ.
గీతా సుగీతా కర్తవ్యా = గీతను చక్కగా విచారింపవలెను.
అజ్ఞా గురూణాం హ్యవిచారణీయా = గురువుల ఆజ్ఞను విచారింపరాదు.
అథాతో బ్రహ్మజిజ్ఞాసా = పిమ్మట ఈ కారణమువలన బ్రహ్మవిచారము చేయవలెను.
విద్యావతాం భాగవతే పరీక్షా = విద్యావంతులకు భాగవతములో పరీక్ష.

ఇయం అవస్థాత్రయప్రక్రియా = ఇది అవస్థాత్రయప్రక్రియ.
అధ్యాత్మవిద్యా విద్యానామ్ = విద్యలలో అధ్యాత్మవిద్య (నేను)
అహింసా పరమో ధర్మః = అహింస గొప్ప ధర్మము.
భూతానాం అస్మి చేతనా = ప్రాణులలో ఎరుకయే నేను.
శర్కరాయాః వర్ణః శ్వేతః = చెక్కెర రంగు తెలుపు.
కన్యా వరయతే రూపమ్ = కన్య రూపమును కోరును.
భాషాసు మధురా గీర్వాణభారతీ = భాషలలో మధురమైనది సంస్కృతము.
సా విద్యా యా విముక్తయే = ముక్తినిచ్చునదే విద్య.
ద్వే విద్యే వేదితవ్యే = రెండు విద్యలు తెలియదగినవి.
విద్యయా అమృతమ్ అశ్నుతే = విద్యవలన అమృతమును పొందును.
సదాశ్రయేణ శోభన్తే పణ్డితా వనితా లతా = మంచి ఆశ్రయమువలన పండితుడు, స్త్రీ, తీగె శోభిల్లుచున్నవి.
అధ్యాసం పణ్డితా అవిద్యా ఇతి మన్యన్తే = పండితులు అధ్యాసను అవిద్య అని తలతురు.
క్షమయా కిం న సిధ్యతి? = ఓరిమిచే ఏది సాధ్యపడదు?
బహురత్నా వసున్ధరా = భూమి చాలా రత్నములు గలిగినది.
చిన్తాయాశ్చ చితాయాశ్చ బిన్దుమాత్రం విశిష్యతే = చింతకును చితకును ఒక సున్నయే తేడా.

## అభ్యాసము 1

తెలుగులో అర్థమును వ్రాయండి —

1) ఏషా పతాకా. 2) సీతాయాః పతిః రామః 3) రామః పేటికాః ఆనయతి. 4) స్వర్గే సుధా అస్తి. 5) విద్యయా కీర్తిం లభతే.

## అభ్యాసము 2

సంస్కృతములో అనువదింపుడు —

1) ఇది బ్రహ్మవిద్య. 2) విద్యలేనివాడు పశువు. 3) మీ పాఠశాల ఎక్కడుంది? 4) పెట్టెలో ఆభరణములు ఉన్నవి.

# సంస్కృత పాఠమాలా

## 11వ పాఠము



ఇకారాంత స్త్రీలింగము 'మతి'

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి. | మతిః | మతీ | మతయః |
| సం.ప్రవి. | హేమతే | హేమతీ | హేమతయః |
| ద్వి.వి. | మతిమ్ | మతీ | మతీః |
| తృ.వి. | మత్యా | మతిభ్యామ్ | మతిభిః |
| చ.వి. | మత్యై, మతయే | ,, | మతిభ్యః |
| ప.వి. | మత్యాః, మతేః | ,, | ,, |
| ష.వి. | ,, ,, | మత్యోః | మతీనామ్ |
| స.వి. | మత్యామ్, మతౌ | ,, | మతిషు |

పై విధముగా నడుపండి —

సిద్ధి; బుద్ధి; ఉన్నతి; అవనతి; గతి; స్థితి; సుషుప్తి; క్షతి; కాన్తి; ప్రాప్తి; మూర్తి; నీతి; ధృతి (ధైర్యం); సమితి; శక్తి; స్మృతి; శ్రుతి; భక్తి; విరక్తి; రాత్రి; విపత్తి; విభూతి; ప్రకృతి, హాని; స్తుతి; ముక్తి; ఆసక్తి; కృతి; సృతి (మార్గం); సమాధి; కీర్తి.

క్రింది ఉదాహరణములను గమనించండి —

యథా దృష్టిః తథా సృష్టిః = దృష్టివలె సృష్టి.

సంపత్తౌ చ విపత్తౌ చ మహతామ్ ఏకరూపతా = సంపదయందు ఆపదయందు మహనీయులు ఒకే విధముగా నుందురు.

సద్భిః కుర్వీత సంగతిమ్ = సజ్జనుల తోడిమైత్రి చేయుడు.

అంత్యే యా మతిః సా గతిః = కడపట ఎట్టి మతియో అట్టి గతి.

మనుష్యాణాం సహస్రేషు కశ్చిద్యతతి సిద్ధయే = వేనకు వేలు మానవులలో ఒకానొకడు సిద్ధికై ప్రయత్నించును.

సమాధిః ఆర్యాణాం ధ్వజా = సమాధి ఆర్యులకు ధ్వజము.
నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరం తప = పరంతప, నా దివ్యమైన విభూతులకు అంతము లేదు.
ధృతిం న విన్దామి శమం చ విష్ణో = ఓ నారాయణా! శమమును ధైర్యమును పొందలేకున్నాను.
రాత్రౌ చన్ద్రః ప్రకాశతే = రాత్రి చంద్రుడు ప్రకాశించును.
నైతే సృతీ పార్థ జానన్‌యోగీ ముహ్యతి = పార్థ, ఈ రెండు మార్గములను తెలిసికొన్న యోగి మోహము చెందడు.
భక్త్యాతు అనన్యయా శక్యః = అనన్యమైన భక్తికి పొందశక్యమైనవాడు.
కొన్ని క్రియలు : భవిష్యత్కాలము — కంఠస్థము చేయండి.

| | ఏక వచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమ పురుషము | గమిష్యతి | గమిష్యతః | గమిష్యన్తి |
| మధ్యమ పురుషము | గమిష్యసి | గమిష్యథః | గమిష్యథ |
| ఉత్తమ పురుషము | గమిష్యామి | గమిష్యావః | గమిష్యామః |

గమిష్యతి = వెళ్ళును; వెళ్ళగలడు; గమిష్యన్తి = వెళ్ళుదురు; వెళ్ళగలరు.
గమిష్యసి = వెళ్ళుదువు: వెళ్ళగలవు; గమిష్యామి = వెళ్ళుదును; వెళ్ళగలను
ఇతరత్ర ఇట్లే ఊహింపవలెను·

కొన్ని అవ్యయములు : కంఠస్థము చేయండి.
అద్య = ఈ రోజు; శ్వః = రేపు; హ్యః = నిన్న; పరశ్వః = ఎల్లుండి.
అద్య భానువాసరః = ఈ రోజు ఆదివారము.
శ్వః మమ మాతులః ఆగమిష్యతి = రేపు నా మేనమామ రాగలడు(వచ్చును)
హ్యః స్థిరవాసరః = నిన్న శనివారము.
పరశ్వః అహం ఆగమిష్యామి = ఎల్లుండి నేను రాగలను (వచ్చెదను)

క్రింది వారముల పేర్లను కంఠస్థము చేయండి—

భానువాసరః = ఆదివారము; ఇన్దువాసరః = సోమవారము;
కుజవాసరః = మంగళవారము సౌమ్యవాసరః = బుధవారము;
గురువాసరః = గురువారము భృగువాసరః = శుక్రవారము
స్థిరవాసరః = శనివారము.

# సంస్కృత పాఠమాలా

## 12వ పాఠము

ఈకారాంత స్త్రీ లింగము "గౌరీ"

| | | | |
|---|---|---|---|
| ప్ర.వి. | గౌరీ | గౌర్యౌ | గౌర్యః |
| సం.ప్ర.వి. | హేగౌరి | హేగౌర్యౌ | హేగౌర్యః |
| ద్వి.వి. | గౌరీమ్ | గౌర్యౌ | గౌరీః |
| తృ.వి. | గౌర్యా | గౌరీభ్యామ్ | గౌరీభిః |
| చ.వి. | గౌర్యై | ,, | గౌరీభ్యః |
| పం.వి. | గౌర్యాః | ,, | గౌర్యీభః |
| ష.వి. | ,, | గౌర్యోః | గౌరీణామ్ |
| స.వి. | గౌర్యామ్ | ,, | గౌరీషు |

ఈ విధముగనే క్రింది శబ్దములను నడుపండి —

వాణీ; నదీ; అటవీ (అడవి); పృథివీ–పృథ్వీ (భూమి); గృహిణీ(భార్య) జననీ (తల్లి); జగతీ (లోకము); నగరీ (నగరము); కుమారీ (కూతురు) పత్నీ; భగినీ (సోదరి); మహిషీ (గేదె); యువతీ; రాజ్ఞీ (రాణి); తన్త్రీ (తంతి) ప్రాచీ(తూర్పు), ప్రతీచీ (పడమర); అవాచీ(దక్షిణము); ఉదీచీ (ఉత్తరము) చుల్లీ (పొయ్యి); కౌముదీ (వెన్నెల); రజనీ (రాత్రి); సరస్వతీ; వల్లకీ (వీణ) పురీ (పురము); స్త్రీ; దేహళీ (కడపమాను); పంచమీ; నవమీ; చర్పటీ (చపాతి); స్థాలీ=పాత్ర లేక లోటి; వటీ (వడ)

సూచన: 'అవీ', 'తన్త్రీ' మున్నగు శబ్దములకు ప్రథమా ఏకవచనములో విసర్గము (ః) ఉండును.

అవీ తన్త్రీ తరీ లక్ష్మీ ధీహ్రీ శ్రీణాముణాదిషు ।
సప్తస్త్రీలిఙ్గశబ్దానాం న సులోపః కదాచన ॥

అవీ (బహిష్ఠైన స్త్రీ) తన్త్రీ, తరీ (ఓడ); లక్ష్మీ; ధీ (బుద్ధి); హ్రీ (సిగ్గు) శ్రీ–ఈ శబ్దములకు ప్రథమాఏకవచనములో విసర్గము ఉండును.

ఉదా: లక్ష్మీః, ధీః, హ్రీః మొదలగునవి,

క్రింది ఉదాహరణములను గమనించండి—

ఇయం గౌరీ = ఈమె గౌరి; ఇయం గంగానదీ = ఇది గంగానది
నదీనాం సాగరో గతిః = నదులకు సాగరమే గతి
గైర్వాణీం వాణీం భజే = గీర్వాణ వాణిని భజింతును.
యత్కఠినం సా పృథివీ = ఏది కఠినమో అది భూమి.
న గృహం గృహమిత్యాహుః గృహిణీ గృహముచ్యతే = గృహము గృహము కాదు; గృహిణియే గృహము.
కామినాం కామినీ సుధా = కాముకులకు కామినియే అమృతము.
ఉద్యోగినం పురుషసింహమ్ ఉపైతి లక్ష్మీః = ఉద్యోగియైన పురుష సింహమును లక్ష్మి పొందును.

కొన్ని క్రియలు: భవిష్యత్కాలము

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమపురుషము | ద్రక్ష్యతి | ద్రక్ష్యతః | ద్రక్ష్యన్తి |
| మధ్యమపురుషము | ద్రక్ష్యసి | ద్రక్ష్యథః | ద్రక్ష్యథ |
| ఉత్తమపురుషము | ద్రక్ష్యామి | ద్రక్ష్యావః | ద్రక్ష్యామః |

అర్థము: ద్రక్ష్యతి = చూడగలడు, చూచును. ద్రక్ష్యతః = ఇద్దరు చూడగలరు; చూచెదరు; ద్రక్ష్యన్తి = చూడగలరు, చూచెదరు;
ద్రక్ష్యసి = చూడగలవు, చూచును - - -
ద్రక్ష్యామి = చూడగలను, చూచెదను ....

## అభ్యాసము 1

తెలుగులో వ్రాయండి —

1. శ్వః రామః చలచ్చిత్రం ద్రక్ష్యతి. 2. అద్య అహం నాటకం పశ్యామి. 3. సంప్రతి అహం పాఠం పఠామి, 4. పరశ్వః మమ మాతులః ఆగమిష్యతి. 5. శ్వః కతి జనాః గీతాం పఠిష్యన్తి?

## అభ్యాసము 2

1. నీవు ఏమి చేయుచున్నావు? 2. ఇది తుంగానది. 3. ఇది తూర్పు. 4. ఇది పడమర. 5. సరస్వతి చదువుల తల్లి.

# సంస్కృత పాఠమాలా

## 13వ పాఠము

ఉకారాన్తము స్త్రీలింగము — ధేను = ఆవు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి | ధేనుః | ధేనూ | ధేనవః |
| సం.ప్ర.వి | హేధేనో | హేధేనూ | హేధేనవః |
| ద్వి.వి | ధేనుమ్ | ధేనూ | ధేనూః |
| తృ.వి | ధేన్వా | ధేనుభ్యామ్ | ధేనుభిః |
| చ.వి | ధేన్వై, ధేనవే | " | ధేనుభ్యః |
| పం.వి | ధేన్వాః, ధేనోః | " | " |
| ష.వి | " | ధేన్వోః | ధేనూనామ్ |
| స.వి | ధేన్వాం, ధేనౌ | ధేన్వోః | ధేనుషు |

పై విధంగానే ఈ దిగువ శబ్దాలను నడపండి—

చంచు (పక్షిముక్కు); తను (శరీరము); రజ్జు (త్రాడు); రేణు(కణము) లఘు (తేలిక); స్నాయు (సన్నపు నరము); హను (వెక్కిలిమీది భాగం): ఇషు (బాణము).

ఈ ఉదాహరణలను గమనింపుడు—

ధేనుః పూజనీయా = ఆవు పూజింపదగినది.

ధేనుః క్షీరం యచ్ఛతి = ఆవు పాలనిచ్చును.

ఇయం రజ్జుః = ఇది త్రాడు. ఇయం రేణుః = ఇది రేణువు.

రామః ఇషుభిః రావణం జఘాన = రాముడు బాణములతో రావణుని చంపెను.

తనౌ అహం ఇతి బుద్ధిః న కార్యా = శరీరంలో నేను అనే బుద్ధి కూడదు.

ఇదం విశ్వం పరమాత్మని రజ్జ్వాం భుజఙ్గమ ఇవ ప్రతిభాతి = ఈవిశ్వం పరమాత్మయందు త్రాటిలో పామువలె తోచుచున్నది.

కొన్ని సర్వనామములు:- అహం = నేను: ఆవామ్ = మేమిద్దరము, మనిద్దరిని వయం = మేము; మాం = నన్ను; అస్మాన్ = మమ్ములను.

గమనించండి :—

అహం రామః = నేను రామునను.

ఆవాం రామలక్ష్మణౌ = మేమిరువురము రామలక్ష్మణులము.

వయం బాలకాః = మేము బాలకులము.

అస్మాన్ అధ్యాపకః తాడయతి = మమ్ము ఉపాధ్యాయుడు కొట్టు చున్నాడు.

ఆవాం గృహం అహ్వాయ = మనిద్దరిని ఇంటికి పిలువుము.

కొన్ని క్రియలు – భూధాతువు = వర్తమానకాలము–కంఠస్థము చేయండి.

| | ఏకవచనము | ద్వివచనము | బహువచనము |
|---|---|---|---|
| ప్రథమపురుషము | భవతి | భవతః | భవన్తి |
| మధ్యమపురుషము | భవసి | భవథః | భవథ |
| ఉత్తమపురుషము | భవామి | భవావః | భవామః |

భవతి = ఉన్నాడు, ఉన్నది, అగును, అగుచున్నది, పుట్టును.

భవన్తి = ఉన్నారు, ఉన్నవి, అగుచున్నది, పుట్టుచున్నవి.

భవసి = ఉన్నావు, ఉందువు, అగుదువు, పుట్టెదవు.

భవామి = ఉన్నాను, ఉందును, అవుదును, పుట్టెదను,

ఇట్లే అన్యరూపములకు అర్థమును ఊహించండి.

'పఠ్' ధాతువు—వర్తమానకాలము.—కంఠస్థము చేయండి.

| | | |
|---|---|---|
| పఠతి | పఠతః | పఠన్తి |
| పఠసి | పఠథః | పఠథ |
| పఠామి | పఠావః | పఠామః |

పఠతి = చదువును, చదువుచున్నాడు, చదువుచున్నది.

పఠతః = ఇరువురు చదువుచున్నారు.

పఠసి = చదువుచున్నావు.

పఠామి = చదువుచున్నాను,

సూచన :— సంస్కృతమున మూడులింగములయందును క్రియలు సమాన రూపములు,

# సంస్కృత పాఠమాలా

## 14వ పాఠము

ఊకారాంతము స్త్రీలింగము — 'వధూ' వధువు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి | వధూః | వధ్వౌ | వధ్వః |
| సం.ప్ర.వి | హేవధు | హేవధ్వౌ | హేవధ్వః |
| ద్వి.వి, | వధూమ్ | వధ్వౌ | వధూః |
| తృ.వి | వధ్వా | వధూభ్యామ్ | వధూభిః |
| చ వి. | వధ్వై | " | వధూభ్యః |
| ప.వి | వధ్వాః | " | " |
| ష.వి | " | వధ్వోః | వధూనామ్ |
| స.వి | వధ్వామ్ | " | వధూషు |

ఈ రీతిగనే క్రింది శబ్దములను నడుపండి—

తనూ (శరీరము); చమూ (సైన్యము); కర్కన్ధూ (రేగు); చమ్పూ (గద్యపద్యాత్మకమైన కావ్యము); పునర్భూ (మారుమనువుది); ప్రసూ (తల్లి); వీరసూ (వీరమాత); శ్వశ్రూ (అత్తగారు)

క్రింది వాక్యములను గమనించండి—

ఏషా వధూః = ఈమె వధువు, ఏతాః వధ్వః = వీరు వధూవులు
కౌసల్యా వీరసూః = కౌసల్య వీరమాత
భారతమాతా వీరప్రసూః = భారతమాత వీరమాత
పక్షిణః కర్కన్ధూః ఖాదన్తి = పక్షులు రేగుపళ్ళు తినుచున్నవి.
అహం చమ్పూం పఠామి = నేను చంపూ కావ్యమును చదువుచున్నాను.
రామః రాక్షసచమూః హతవాన్ = రాముడు రాక్షసుల సేనను చంపెను.
ఇయం తనూ నశ్వరా = ఈ శరీరము శాశ్వతము కానిది,
శివస్య శ్వశ్రూః మేనా = మేన శివుని అత్త,

13వ పాఠములో 'పచ్' ధాతువుయొక్క వర్తమానకాలమందలి తొమ్మిది రూపములవలె ఈ దిగువ తెల్పిన రూపములను నడుపండి. ప్రథమ పురుషలో మాత్రము రూపములు ఇవ్వబడినవి. మిగిలినవి ఊహించండి—

| ధాతువు | ప్రథమ పురుషము | అర్థము |
|---|---|---|
| పచ్ | పచతి—పచతః—పచన్తి | వండుచున్నాడు .... |
| వద్ | వదతి—వదతః—వదన్తి | చెప్పుచున్నాడు .... |
| దృశ్ | పశ్యతి—పశ్యతః—పశ్యన్తి | చూచుచున్నాడు .... |
| పా | పిబతి—పిబతః—పిబన్తి | త్రాగుచున్నాడు ... |
| గమ్ | గచ్ఛతి—గచ్ఛతః—గచ్ఛన్తి | వెళ్ళుచున్నాడు .... |
| ఆ+గమ్ | ఆగచ్ఛతి—ఆగచ్ఛతః—ఆగచ్ఛన్తి | వచ్చుచున్నాడు .... |
| ఖాద్ | ఖాదతి—ఖాదతః—ఖాదన్తి | తినుచున్నాడు .... |
| స్థా | తిష్ఠతి—తిష్ఠతః—తిష్ఠన్తి | కూర్చొనుచున్నాడు .... ఆగుచున్నాడు .... |
| ఘ్రా | జిఘ్రతి—జిఘ్రతః—జిఘ్రన్తి | మూర్కొనుచున్నాడు .... |
| జి | జయతి—జయతః—జయన్తి | జయించుచున్నాడు .... |
| భజ్ | భజతి—భజతః—భజన్తి | భజించుచున్నాడు .... |
| నీ | నయతి—నయతః—నయన్తి | తీసుకొని వెళ్ళుచున్నాడు .... పిలుచుకొనివెళ్లుచున్నాడు .... |
| ఆ+నీ | ఆనయతి—ఆనయతః—ఆనయన్తి | తీసుకొనివచ్చుచున్నాడు .... పిలుచుకొనివస్తున్నాడు..... |
| వహ్ | వహతి—వహతః—వహన్తి | మోయుచున్నాడు .... |
| చర్ | చరతి—చరతః—చరన్తి | తిరుగుచున్నాడు .... మేయుచున్నది..... |

—మరికొన్నిటిని రాబోవు పాఠములో నేర్చుకొండి.

అభ్యాసము 1 సంస్కృతములో అనువదించండి.

1. మేము పాఠము చదువుచున్నాము. 2. అతడు ఉపాధ్యాయుని పిలుచుకొనివచ్చుచున్నాడు. 3. గోవులు గడ్డిమేయుచున్నవి. 4. మేము పండ్లు తినుచున్నాము. 5. దేవుడు విశ్వమును రక్షించును.

# సంస్కృతపాఠమాలా

## 15వ పాఠము



ఋకారాంత స్త్రీలింగము 'మాతృ' తల్లి

| విభక్తులు | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి. | మాతా | మాతరౌ | మాతరః |
| సం ప్ర.వి. | హే మాతః | హే మాతరౌ | హే మాతరః |
| ద్వి.వి. | మాతరమ్ | మాతరౌ | మాతౄః |
| తృ.వి. | మాత్రా | మాతృభ్యామ్ | మాతృభిః |
| చ.వి. | మాత్రే | ,, | మాతృభ్యః |
| ప.వి. | మాతుః | ,, | ,, |
| ష.వి. | ,, | మాత్రోః | మాతౄణామ్ |
| స.వి. | మాతరి | ,, | మాతృషు |

పై శబ్దమువలె క్రింది శబ్దములను నడుపండి –

యాతృ (తోడికోడలు); ననాన్దృ (మగని తోడబుట్టినది);

దుహితృ (కూతురు)

ఉదాహరణములను గమనించండి –

న మాతుః పరదైవతమ్ = తల్లిని మించిన దైవము లేదు.

తవ మాతా కా? = నీ తల్లి ఎవతె?

కౌసల్యా రామస్య మాతా = కౌసల్య రాముని తల్లి.

వన్దే మాతరమ్ = తల్లికి నమస్కరించుచున్నాను.

రామస్య కౌసల్యా, కైకేయీ, సుమిత్రా చేతి తిస్రః మాతరః =
రామునకు కౌసల్యా, కైకేయీ, సుమిత్ర అని ముగ్గురు తల్లులు.

మాత్రే నమః = తల్లికి నమస్కారము.

రామస్య మాతరి అతీవ భక్తిః ఆసీత్ = రామునకు తల్లియందు
అమితమైన భక్తి ఉండెను.

మాతా చ పార్వతీదేవీ, పితా దేవో మహేశ్వరః = తల్లి పార్వతీదేవి,
తండ్రి మహేశ్వరుడు.

సూచన:- 13వ పాఠములో 'పఠ్' ధాతువుయొక్క వర్తమానకాల మందలి తొమ్మిది రూపములవలె ఈ దిగువ రూపములను నడుపండి. ఇచట ప్రథమ పురుషములో మూడు రూపములు మాత్రం ఇవ్వబడినవి. ఏకవచనంలోమాత్రము అర్థము ఇవ్వబడినది. మిగిలినవాటిని ఊహించండి-

| ధాతువు | ప్రథమపురుషము | అర్థము |
|---|---|---|
| జీవ్ | జీవతి - జీవతః - జీవన్తి | జీవించుచున్నాడు .... |
| హస్ | హసతి - హసతః - హసన్తి | నవ్వుచున్నాడు .... |
| రక్ష్ | రక్షతి - రక్షతః - రక్షన్తి | రక్షించును .... |
| చల్ | చలతి - చలతః-చలన్తి | కదులుచున్నది .... |
| నన్ద్ | నన్దతి - నన్దతః - నన్దన్తి | సంతోషించుచున్నాడు .... |
| పత్ | పతతి - పతతః - పతన్తి | పడుచున్నాడు. .... |
| వస్ | వసతి - వసతః - వసన్తి | వసించుచున్నాడు .... |
| శ్రు | శృణోతి - శృణుతః - శృణ్వన్తి | వినుచున్నాడు .... |
| గై | గాయతి - గాయతః - గాయన్తి | పాడుచున్నాడు .... |
| రుహ్ | రోహతి - రోహతః - రోహన్తి | మొలచును .... |
| ఖన్ | ఖనతి - ఖనతః - ఖనన్తి | త్రవ్వుచున్నాడు .... |
| నిన్ద్ | నిన్దతి - నిన్దతః - నిన్దన్తి | తిట్టుచున్నాడు .... |
| వప్ | వపతి - వపతః - వపన్తి | విత్తుచున్నాడు .... |
| ధ్యై | ధ్యాయతి-ధ్యాయతః-ధ్యాయన్తి | ధ్యానించుచున్నది .... |
| తౄ | తరతి - తరతః - తరన్తి | దాటుచున్నాడు .... |

అభ్యాసము 1 తెలుగులో అనువదించండి -

1) మాతా అన్నం పచతి. 2) గృహే మమ మాతా వసతి 3) అహం గానం శృణోమి 4) కృషకః భూమిం ఖనతి 5) భక్తః దేవం ధ్యాయతి 6) అహం నదీం తరామి. 7) వృక్షే పత్రాణి చలన్తి.

అభ్యాసము 2 సంస్కృతములో వ్రాయండి -

1) ఈమె అతని కూతురు. 2) నన్ను నా తల్లి నిందించుచున్నది. 3) ఉమ యొక్క తల్లి మేనా 4) గాయకులు గానము చేయుచున్నారు.

# సంస్కృత పాఠమాలా

## 1వ పాఠము

పున్నపుంసకలింగములో వర్తించునది— కర్తృ = చేయునది; చేయువాడు. పుంలింగములో 'ధాతృ' శబ్దమువలె వర్తించును. ఇపుడు దీనికి నపుంసకలింగరూపములను గమనించండి—

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి. | కర్తృ | కర్తృణీ | కర్తౄణి |
| సం. ప్ర. వి. | హేకర్తః, హేకర్తృ | హేకర్తృణీ | హేకర్తౄణి |
| ద్వి. వి. | కర్తృ | కర్తృణీ | కర్తౄణి |
| తృ. వి. | కర్తృణా, కర్త్రా | కర్తృభ్యామ్ | కర్తృభిః |

మిగిలినది ధాతృశబ్దమువలె.

దీనినే స్త్రీలింగములో 'కర్త్రీ' అని మార్చుకొనినదీశబ్దమువలె నడప వలెను.

క్రింద తెల్పిన శబ్దములను పైవిధముగా నడుపండి—

భవితృ (అగునది); గన్తృ (వెళ్ళునది); దాతృ (ఇచ్చునది); ద్రష్టృ(చూచు నది): జేతృ (గెలుచునది); నేతృ (తీసికొని వెళ్ళునది); కర్తృ= చేయునది; శంస్తృ (ప్రశంసించునది); మన్తృ (ఆలోచించునది); హర్తృ (హరించునది) భోక్తృ (అనుభవించునది).

పై వానిని స్త్రీలింగములో భవిత్రీ, గన్త్రీ, దాత్రీ. ద్రష్ట్రీ, నేత్రీ మున్నగు రూపములలో మార్చి నదీశబ్దమువలె నడపండి.

సూచన : ఇవి విశేషణములుగా ప్రయోగింపబడుటను, ముమ్ముందు తెలిసి కొందురు.

ఉదాహరణములను గమనింపుడు —

ఏతస్య మమ మిత్రమేవ కర్తృ= ఇందుకు నా మిత్రుడే కర్త.
ఏషా అస్మాకం నేత్రీ = ఈమె మన నాయకురాలు.

ఆత్మా సర్వస్య ద్రష్టా = ఆత్మ సమస్తమునకు ద్రష్ట.
తత్ర గచ్ఛ్ మమ మిత్రం పశ్య = అచట వెళ్ళుచున్న నా మిత్రుని చూడుము

కొన్ని క్రియలు :- ఇంతవరకు భ్వాదిప్రకరణములోని కొన్ని క్రియలను తెలిసికొన్నారు. ఇప్పుడు అదాదిప్రకరణమందలి క్రియలను దిగువ తెలిపితిని—

అద్ = తినుట

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్రథమ పురుషము | అత్తి | అత్తః | అదన్తి |
| మధ్యమ పురుషము | అత్సి | అత్థః | అత్థ |
| ఉత్తమ పురుషము | అద్మి | అద్వః | అద్మః |

అత్తి = తినుచున్నాడు. అత్తః = ఇద్దరు తినుచున్నారు. అదన్తి = చాలమంది తినుచున్నారు. అత్సి = తినుచున్నావు మున్నగు విధముల అర్థము గ్రహించండి, మరికొన్నిటిని నేర్చుకొండి—

హన్ = చంపుట.

హన్తి–హతః–ఘ్నన్తి = చంపుచున్నాడు–చంపుచున్నారు–చంపుచున్నారు.
హంసి–హథః–హథ = చంపుచున్నావు–చంపుచున్నారు–చంపుచున్నారు.
హన్మి–హన్వః–హన్మః = చంపుచున్నాను–చంపుచున్నాము–చంపుచున్నాము.

ఉదాహరణలు—

రామః అన్నమ్ అత్తి = రాముడు అన్నము తినుచున్నాడు.
శుకాః ఫలాని అదన్తి = చిలుకలు పండ్లు తినుచున్నవి.
వృషభౌ పత్రాణి అత్తః = ఎద్దులు ఆకులను తినుచున్నవి.
త్వం కిమ్ అత్సి? = నీవు ఏమి తినుచున్నావు? (తిందువు?)
కిరాతః జన్తూన్ హన్తి = కిరాతుడు జంతువులను చంపుచున్నాడు.
తౌ మేషం హతః = వారిరువురు మేకను చంపుచున్నారు.
అరణ్యే తే మృగాన్ ఘ్నన్తి = వారు అడవిలో జింకలను చంపుచున్నారు.

అభ్యాసము:- సంస్కృతములో వ్రాయండి.

1. కిరాతుడు జింకను చంపుచున్నాడు. 2. వారు చీమలను చంపుచున్నారు, 3. భూమి అన్నము నిచ్చునది. 4. వారు పాలు పిండుచున్నారు.

# సంస్కృత పాఠమాలా

## 17వ పాఠము

చకారాంత పుంలింగము 'జలముచ్' (మేఘము)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.విభక్తి | జలముక్ | జలముచౌ | జలముచః |
| సం.ప్ర.వి | హేజలముక్ | హేజలముచౌ | హేజలముచః |
| ద్వి.వి. | జలముచం | జలముచౌ | జలముచః |
| తృ.వి. | జలముచా | జలముగ్భ్యామ్ | జలముగ్భిః |
| చ.వి. | జలముచే | ,, | జలముగ్భ్యః |
| పం.వి. | జలముచః | ,, | ,, |
| ష.వి. | ,, | జలముచోః | జలముచామ్ |
| స.వి. | జలముచి | ,, | జలముక్షు |

పై విధముగనే దిగువ తెలిపిన శబ్దములను నడుపండి—
సువాచ్ (చక్కగామాట్లాడువాడు); పయోముచ్ (మబ్బు); వారిముచ్ (మేఘం)

జకారాంత పుంలింగము 'భిషజ్' (వైద్యుడు)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.విభక్తి | భిషక్ | భిషజౌ | భిషజః |
| సం.ప్ర.వి. | హేభిషక్ | హేభిషజౌ | హేభిషజః |
| ద్వి.వి. | భిషజమ్ | భిషజౌ | భిషజః |
| తృ.వి. | భిషజా | భిషగ్భ్యామ్ | భిషగ్భిః |
| చ.వి. | భిషజే | ,, | భిషగ్భ్యః |
| పం.వి. | భిషజః | ,, | ,, |
| ష.వి. | ,, | భిషజోః | భిషజామ్ |
| స వి. | భిషజి | ,, | భిషక్షు |

ఈ రీతిగనే తనుత్యజ్ (శరీరమును వదలువాడు), ఋత్విజ్ (ఋత్విక్కు) మొః

ఉదాహరణలను గమనించండి—

**జలముచః** వర్షన్తి = మేఘములు వర్షించుచున్నవి.

ఆదానం హి ప్రదానాయ సతాం వారిముచామివ = సత్పురుషులు దేనినైన తీసికొనుట ఎందుకంటె మేఘమువలె మరలా నిచ్చుటకే.

అయం భిషక్ = ఇతడు వైద్యుడు, ఏతే భిషజః = వీరు వైద్యులు.

భవరోగభిషజే ఈశ్వరాయ నమః = భవరోగవైద్యుడైన ఈశ్వరునకు నమస్కారము.

శఙ్కరం పరతరం భిషజం భజామి = శ్రేష్ఠుడైన భవరోగవైద్యుడైన శ్రీశంకరాచార్యులను భజించుచున్నాను.

**ఋత్విజః** యజ్ఞశాలాయాం మన్త్రాన్ పఠన్తి = ఋత్విజులు యజ్ఞశాలలో మన్త్రములను ఉచ్చరిస్తున్నారు.

కొన్ని క్రియలు:—

'అస్' – ఉండుట – ధాతువు – వర్తమానకాలము.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.పు. | అస్తి | స్తః | సన్తి |
| మ.పు. | అసి | స్థః | స్థ |
| ఉ.పు. | అస్మి | స్వః | స్మః |

అస్తి = ఉన్నాడు, ఉన్నది.
స్తః = రెండు ఉన్నవి. ఇద్దరున్నారు
సన్తి = (చాలా) ఉన్నవి. ఉన్నారు
అసి = ఉన్నావు———
అస్మి = ఉన్నాను.———

ఉదాహరణలను గమనించండి:

కలమః అస్తి = కలము ఉన్నది. పేటికా అస్తి = పెట్టె ఉన్నది.

త్వమ్ అసి = నీవు ఉన్నావు. యూయం స్థ = మీరు ఉన్నారు.

అహమ్ అస్మి = నేను ఉన్నాను. వయం స్మః = మేము ఉన్నాము.

అక్షరాణామ్ అకారః అస్మి = అక్షరములలో అకారము(గా) ఉన్నాను.

అహం బ్రహ్మ అస్మి = నేను బ్రహ్మము(గా) ఉన్నాను.

తత్ త్వమ్ అసి = నీవు అది (బ్రహ్మము)గా ఉన్నావు.

# సంస్కృత పాఠమాలా

## 18వ పాఠము



తకారాంతము – పుంలింగము 'మరుత్' (గాలి)

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి. | మరుత్ | మరుతౌ | మరుతః |
| సం.ప్ర.వి. | హేమరుత్ | హేమరుతౌ | హేమరుతః |
| ద్వి.వి. | మరుతమ్ | మరుతౌ | మరుతః |
| తృ.వి. | మరుతా | మరుద్భ్యామ్ | మరుద్భిః |
| చ.వి. | మరుతే | ,, | మరుద్భ్యః |
| పం.వి. | మరుతః | ,, | ,, |
| ష.వి. | ,, | మరుతోః | మరుతామ్ |
| స.వి. | మరుతి | ,, | మరుత్సు |

ఇదేరీతి ఇంద్రజిత్, సోమసుత్, భాష్యకృత్ మున్నగువానిని నడుపండి.

తకారాంతము – పుంలింగము 'పచత్' వండుచున్నవాడు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి. | పచన్ | పచన్తౌ | పచన్తః |
| సం ప్ర.వి. | హే పచన్ | హే పచన్తౌ | హే పచన్తః |
| ద్వి.వి. | పచన్తం | పచన్తౌ | పచతః |

మిగిలినది 'మరుత్' శబ్దమువలె నడుపండి.

ఈ విధముగనే భవన్ (ఉండువాడు), తుదన్ (నొప్పిగలిగించుచున్నవాడు) కుర్వన్ (చేయుచున్నవాడు మొ॥)

ఉదాహరణలను గమనించండి—

**మరుతా** పత్రాణి చలన్తి = గాలికి ఆకులు అల్లాడుచున్నవి.
హనుమాన్ **మరుతః** పుత్రః = హనుమంతుడు వాయువుయొక్క పుత్రుడు.
**మరుతే** నమః = వాయువుకు నమస్కారము.
స్వర్గే సప్త **మరుతః** సన్తి = స్వర్గములో ఏడుగురు మరుత్తులు కలరు.
**మరుతా అగ్నిః** జాయతే = గాలిచే అగ్నిపుట్టును.

ఇన్ద్రజిత్ రావణస్య పుత్రః = ఇంద్రజిత్తు రావణుని కొడుకు.
భాష్యకృద్భ్యో నమః = భాష్యకారులకు నమస్కారము.

కొన్ని క్రియలు:— 'యా' పొందుట, వెళ్ళుట.

| | ఏ | ద్వి | బ | |
|---|---|---|---|---|
| ప్ర.పు. | యాతి | యాతః | యాన్తి | యాతి = వెళ్ళుచున్నాడు, పొందుచున్నాడు. |
| మ.పు. | యాసి | యాథః | యాథ | |
| ఉ.పు. | యామి | యావః | యామః | యాసి = వెళ్ళుచున్నావు........ |

ద్విష్ = ద్వేషించుట.

| | ఏ | ద్వి | బ | |
|---|---|---|---|---|
| ప్ర.పు. | ద్వేష్టి | ద్విష్టః | ద్విషన్తి | |
| మ.పు. | ద్వేక్షి | ద్విష్ఠః | ద్విష్ఠ | ద్వేష్టి = ద్వేషించుచున్నాడు. |
| ఉ.పు. | ద్వేష్మి | ద్విష్వః | ద్విష్మః | |

ఉదాహరణలను గమనించండి—

సః కుత్ర **యాతి**? = అతడు ఎక్కడ వెళ్ళుచున్నాడు?
త్వం కుత్ర **యాసి**? = నీవు ఎక్కడకు వెళ్ళుచున్నావు?
యః పాపం కరోతి సః నరకం **యాతి** = ఎవడు పాపము చేయునో అతడు నరకము పొందును.
అనన్యభక్తః పరమగతిం **యాతి** = అనన్యభక్తుడు మోక్షమును పొందును.
అతః త్వం కుత్ర **యాసి** = ఇచటనుండి నీవు ఎక్కడకు వెళ్ళుదువు?
నాస్తికః భక్తాన్ ద్వేష్టి = నాస్తికుడు భక్తులను ద్వేషించును.
సజ్జనాః పాపకర్మాణి ద్విషన్తి = మంచివారు చెడ్డకర్మలను ద్వేషింతురు.

తెలుగులో అనువదింపుడు :

1. ఏషః కుత్రయాతి?
2. జ్ఞానేన మోక్షం యాతి
3. సః మాతరం ద్వేష్టి
4. మరుతః ఆకారః నాస్తి
5. అహం పాపం ద్వేష్మి
6. వయం దురాచారం ద్విష్మః

సంస్కృతంలో వ్రాయండి:—

1. మేము ఇచట ఉన్నాము. 2. వైద్యులు పుణ్యమును పొందుచున్నారు.

# సంస్కృత పాఠమాలా

## 19వ పాఠము

### సర్వనామములు (PRONOUNS)

నామవాచకమునకు బదులుగా వాడబడే పదములు సర్వనామములు. ఇవి ముఖ్యముగా వ్యక్తివాచకములు, ఆత్మవాచకములు, సంఖ్యావాచకములు అని మూడు విధములు.

### వ్యక్తివాచకములు

| ప్రాతిపదికములు | అర్థము | ప్రాతిపదికములు | అర్థము |
|---|---|---|---|
| సర్వ | = ప్రతిఒకడు, ప్రతిఒకటి | తద్ | = అది, అతడు, ఆమె |
| విశ్వ | = ,, ,, | ఏతద్ | = ఇది, ఇతడు, ఈమె |
| ఇతర | = వేరొకడు, వేరొకటి | ఇదమ్ | = ,, ,, ,, |
| అన్య | = ,, ,, | అదస్ | = ,, ,, |
| ఏక | = ఒకడు, ఒకటి | కిమ్ | = ఎవడు, ఏది |
| పూర్వ | = మొదటివాడు, మొదటిది | యద్ | = ,, ,, |
| పర | = తర్వాతిది, తర్వాతివాడు | తావత్ | = అంత |
| అపర | = ,, ,, | ఏతావత్ | = ఇంత |
| ఉత్తర | = ,, ,, | ఇయత్ | = ,, |
| దక్షిణ | = కుడివైపువాడు. కుడివైపుగలది | యావత్ | = ఎంత |
| అధర | = క్రిందివాడు. క్రిందగలది | కియత్ | = ,, |
| తాదృశ్ | = అట్టిది, అట్టివాడు | యాదృశ్ | = ఎట్టిది, ఎట్టివాడు |
| ఏతాదృశ్ | = ఇట్టిది, ఇట్టివాడు | కీదృశ్ | = ,, ,, |

### ఆత్మవాచకములు

అస్మద్ = నేను

యుష్మద్ = నీవు

భవత్ = నీవు (గౌరవార్థకము)

స్వ = తాను

## సంఖ్యావాచకములు

ఇది మరలా సంఖ్యానార్థకములు, పూరణార్థకములు, సముదాయార్థకములు అని మూడు రకములు

### పంఖ్యానార్థకములు (eardinals)

ప్రాతిపదికములు - అర్థములు

| | | |
|---|---|---|
| ఏక = ఒకటి | ఏకాదశన్ = పదుకొండు | సప్తతి = డెబ్బది |
| ద్వి,ఉభ = రెండు | నవదశన్ వరకు ఇట్లే | అశీతి = ఎనుబది |
| త్రి = మూడు | ఊహింపవలెను.నవదశన్‌కు | నవతి = తొంబది |
| చతుర్ = నాల్గు | 'ఏకోనవింశతి'అని కూడ కలదు. | శత = నూరు |
| పఞ్చన్ = ఐదు | వింశతి = ఇరువది | సహస్ర = వేయి |
| షష్ = ఆరు | త్రింశత్ = ముప్పది | అయుత = పదివేలు |
| సప్తన్ = ఏడు | చత్వారింశత్ = నలుబది | లక్ష,నియుత = లక్ష |
| అష్టన్ = ఎనిమిది | పఞ్చాశత్ = ఏబది | ప్రయుత = పదిలక్షలు |
| నవన్ = తొమ్మిది | షష్టి = అరువది | కోటి = కోటి |
| దశన్ = పది | —— | కతి = ఎన్ని |
| | | కతిపయ = కొన్ని |

### పూరణార్థకములు (ordinals)

| ప్రాతిపదికములు | అర్థము | ప్రాతిపదికములు | అర్థము |
|---|---|---|---|
| ప్రథమ | = మొదటి | దశమ | = పదవ |
| ద్వితీయ | = రెండవ | ఏకాదశ | = పదకొండవ |
| తృతీయ | = మూడవ | ద్వాదశ | = పండ్రెండవ |
| చతుర్థ, తురీయ, తుర్య | = నాల్గవ | త్రయోదశ | = పదమూడవ |
| పఞ్చమ | = ఐదవ | చతుర్దశ | = పదునాల్గవ |
| షష్ఠ | = ఆరవ | పఞ్చదశ | = పదునైదవ |
| సప్తమ | = ఏడవ | షోడశ | = పదునారవ |
| అష్టమ | = ఎనిమిదవ | సప్తదశ | = పదిహేడవ |
| నవమ | = తొమ్మిదవ | అష్టాదశ | = పదనెనిమిదవ |
| | | నవదశ, ఏకోనవింశ, ఏకోనవింశతితమ | = పందొమ్మిదవ |

వింశ, వింశతితమ = ఇరువదవ
త్రింశ, త్రింశత్తమ = ముప్పదవ
చత్వారింశ, చత్వారింశత్తమ = నలుబదవ
పఞ్చాశ, పఞ్చాశత్తమ = ఏబదవ
షష్ట, షష్టితమ = అరువదవ
అశీతి, అశీతితమ = ఎనుబదవ
నవతి, నవతితమ = తొంబదవ

శతతమ = నూరవ
సహస్రతమ = వేయవ
అయుతతమ = పదివేల
లక్షతమ, నియుతతమ = లక్షవంతు
ప్రయుతతమ = పదిలక్షల
కోటితమ = కోటివంతు
కతితమ, కతిథ = ఎన్నవ
కతిపయథ = కొన్నిటి

## సముదాయార్థకములు (collectives)

### ప్రాతిపదికములు

ద్వయ, ద్వితీయ, ఉభయ = రెండింటి సమూహము. దిగువ సూచించినవాటికి ఇట్లే అర్థమును ఊహింపవలెను.

త్రయ, త్రితయ
చతుష్టయ, చతుష్క
పఞ్చతయ, పఞ్చక
షట్క
సప్తక
అష్టక
నవక
దశక
ఏకాదశ (క)
ఏకాదశీ
ద్వాదశ (క)
ద్వాదశీ
త్రయోదశ (క)
త్రయోదశీ

చతుర్దశ (క)
చతుర్దశీ
పఞ్చదశ (క)
పఞ్చదశీ
షోడశ (క)
షోడశీ
సప్తదశ (క)
సప్తదశీ
అష్టాదశ (క)
అష్టాదశీ
నవదశ (క)
నవదశీ
ఏకోనవింశతి, వింశీ, వింశికా

# సంస్కృత పాఠమాలా
## 19వ పాఠము

(గతసంచిక తరువాయి)

సర్వః = ప్రతియొకడు, సర్వౌ = ప్రతియిరువురు, సర్వే = అందరు
సర్వమ్ = ప్రతియొకనిని, సర్వేణ = ప్రతియొకనిచే, సర్వస్య = ప్రతియొకనికి

ఇట్లే మిగతా రూపములకు అర్థమును ఊహింపుడు.

ఉదాహరణలను గమనించండి—

సర్వః అత్ర ఉపవిశతి = ప్రతియొకడు ఇచట కూర్చొన్నాడు.
సర్వే సుఖినోభవన్తు = అందరు సుఖవంతులు అగుదురుగాక.
సర్వః సర్వం నజానాతి = ప్రతివానికి ప్రతివిషయమూ తెలిసివుండదు.
సర్వస్మై పుస్తకం దేహి = ప్రతివానికి పుస్తకమును ఇమ్ము.
సర్వేషాం శాన్తిః భవతు = అందరుకు శాంతి కలుగుగాక.
సర్వస్మిన్ పరమాత్మా అస్తి = ప్రతియొకరిలో పరమాత్మ ఉన్నాడు.
ఆత్మా సర్వస్య భాజనమ్ = ప్రతియొక్కదాని ఉనికి ఆత్మయే.
సర్వస్మాత్ అస్మాకం భయం నాస్తి = ప్రతియొకరినుండి మనకు భయములేదు.
సర్వేణ ఇదం కార్యం కృతమ్ = ప్రతియొకనిచే ఈ పని చేయబడెను.

అకారాంత నపుంసకలింగము— 'సర్వ'

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర.వి. | సర్వమ్ | సర్వే | సర్వాణి |
| సం.ప్ర.వి. | హేసర్వ | హేసర్వే | హేసర్వాణి |
| ద్వి.వి. | సర్వమ్ | సర్వే | సర్వాణి |

— మిగిలినది పుంలింగంలో వలె.

ఆకారాంత స్త్రీలింగము – 'సర్వా'

| | ఏ. | ద్వి | బ. |
|---|---|---|---|
| ప్ర.వి. | సర్వా | సర్వే | సర్వాః |
| సం.ప్ర.వి. | హేసర్వే | హేసర్వే | హేసర్వాః |

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ద్వి.వి. | సర్వామ్ | సర్వే | సర్వాః |
| తృ.వి. | సర్వయా | సర్వాభ్యామ్ | సర్వాభిః |
| చ.వి. | సర్వస్యై | సర్వాభ్యామ్ | సర్వాభ్యః |
| పం.వి. | సర్వస్యాః | ,, | ,, |
| ష.వి. | సర్వస్యాః | సర్వయోః | సర్వాసామ్ |
| స.వి. | సర్వస్యామ్ | సర్వయోః | సర్వాసు |

ఉదాహరణలను గమనించండి —

సర్వస్య గాత్రస్య శిరః ప్రధానమ్=శరీరమున కంతటికి శిరస్సే ముఖ్యము.
సర్వేన్ద్రియాణాం నయనం ప్రధానమ్ = అన్ని ఇంద్రియములలో నేత్రమే ముఖ్యము.
సర్వే నమస్యన్తి చ సిద్ధ సంఘాః=సిద్ధ సంఘములన్నీ నమస్కరించుచున్నవి.
వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః=అన్ని వేదాలచే తెలియదగిననాడను నేనే.
సర్వం కర్మాఖిలం పార్థ జ్ఞానే పరిసమాప్యతే=అర్జునా!సకల కర్మ జ్ఞానమున సమాప్తి నొందును.
అవ్యక్తాద్ వ్యక్తయఃసర్వాః ప్రభవన్త్యహరాగమే = బ్రహ్మదేవుని పగటి యందు ఈ చరాచరభూతములు అవ్యక్తమునుండి పుట్టుచున్నవి.
పుష్ణామి చౌషధీః సర్వాః సోమో భూత్వా రసాత్మకః = అమృత కిరణుడగు చంద్రుడనై పైరు-పంటలను పెంచుచున్నాను.
సర్వస్యై బాలికాయై గీతాం యచ్ఛ=ప్రతి బాలికకు గీత నిమ్ము.
సర్వస్యాం సంచికాయాం పుస్తకాని సన్తి = ప్రతిసంచిలో పుస్తకములుఉన్నవి.

అభ్యాసము : 1 అనువదింపుడు

1) సర్వేషామ్ ఆత్మా హి జీవనమ్. 2) సర్వేషు దోషః నాస్తి. 3) సర్వః పాఠం పఠతి. 4) వృక్షే సర్వాణి పత్రాణి చలన్తి. 5) సర్వస్యాం పేటికాయాం కలమాః సన్తి.

అభ్యాసము ; 2 సంస్కృతంలో అనువదింపుడు.

1. అచటికి అందరు వస్తున్నారు. 2. అందరకు పుస్తకములున్నవి. 3. ప్రతిదానిలో దేవుడున్నాడు. 4. అందరిని చూచుచున్నాను.

# సంస్కృత పాఠమాలా
## 20వ పాఠము

దకారంతపుంలింగము 'తద్'

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర.వి. | సః | తౌ | తే |
| ద్వి వి. | తమ్ | తౌ | తాన్ |
| తృ.వి. | తేన | తాభ్యామ్ | తైః |
| చ.వి. | తస్మై | ,, | తేభ్యః |
| పం.వి. | తస్మాత్ | ,, | ,, |
| ష.వి. | తస్య | తయోః | తేషామ్ |
| స.వి. | తస్మిన్ | తయోః | తేషు |

సూచన: తద్, ఏతద్, యుష్మద్, అస్మద్, కిం, ఇదం, అదస్ అను శబ్దములకు సంబోధన లేదు.

సః = అతడు, అది; తౌ = వారిరువురు, అవి; తే = వారు,అవి తమ్ = అతనిని, దానిని; తౌ = వారిరువురిని... తాన్ = వారిని,వాటిని ఇట్లే మిగిలిన రూపములకు అర్థమును ఊహించండి.

దకారాంత స్త్రీలింగము 'తద్'

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర.వి. | సా | తే | తాః |
| ద్వి.వి. | తామ్ | తే | తాః |
| తృ.వి. | తయా | తాభ్యామ్ | తాభిః |
| చ.వి. | తస్యై | ,, | తాభ్యః |
| ప.వి. | తస్యాః | ,, | ,, |
| ష.వి. | ,, | తయోః | తాసామ్ |
| స.వి. | తస్యామ్ | ,, | తాసు |

సా = ఆమె, అది; తే = వారిరువురు, ఆ రెండు; తాః = వారు, అవి తామ్ = ఆమెను, దానిని.... మున్నగు విధముల అర్థమును ఊహించండి.

దకారాన్త నపుంసకలింగము 'తద్'

| | ఏ. | ద్వి. | బ. |
|---|---|---|---|
| ప్ర.వి. | తత్ | తే | తాని |
| ద్వి.వి. | తత్ | తే | తాని |

మిగిలినది పుంలింగములోవలె.

తత్ = అది, వాడు, ఆమె; తాని = వారు, అవి మిగిలినవాటిని ఊహించండి.

ఉదాహరణములను గమనించండి —

సః రామః = వాడు, రాముడు. సః వృక్షః = అది చెట్టు.
తౌ ఘటౌ = అవి(రెండు) కుండలు. **తాన్** అహ్వాయ = వారిని పిలువుము.
**తేన** ఇదం కార్యం కృతమ్ = అతనిచే ఈ పని చేయబడెను.
**తస్మై** పుస్తకం దేహి = అతనికి పుస్తకము నిమ్ము.
**సా** లతా = ఆమె లత. **సా** పేటికా = అది పెట్టె
ఇదం **తస్యాః** పుస్తకమ్ = ఇది ఆమెయొక్క పుస్తకము.
**సా** విద్యా యా విముక్తయే = విముక్తినిచ్చునదే విద్య.
**తాని** పుస్తకాని = అవి పుస్తకములు.
**తత్** మమ కళత్రమ్ = ఆమె నా భార్య.
**తత్** మమ మిత్రమ్ = అతడు నా మిత్రుడు.
**తత్** త్వమ్ = అది నీవు.
**తస్మై** శ్రీ గురవే నమః = ఆ గురువునకు నమస్కారము.
**తేషాం** కలమాః కుత్ర సన్తి? = వారి కలములు ఎక్కడఉన్నాయి?
న **తస్య** కార్యం కరణం చవిద్యతే = అతనికి కార్యంకాని కారణంకాని లేదు.
న **సా** సభా యత్ర న సన్తి వృద్ధాః = వృద్ధులు లేని సభ సభ కాదు.
**తాసు** పేటికాసు కలమాః సన్తి = ఆ పెట్టెలలో కలములు ఉన్నవి.

అభ్యాసము 1 తెనుగులో వ్రాయండి.

1) తే కిం ఖాదన్తి 2) తే కుత్ర పచన్తి? 3) తాః కిం కుర్వన్తి? 4) తస్యాః నామధేయం కిమ్? 5) తాని మమ మిత్రాణి 6) తాః లతాః

# సంస్కృత పాఠమాలా

## 21వ పాఠము

## విశేషణాలు – వాటిప్రయోగం

నామములకుగల విశేషాలను తెలియజేసే పదాలు విశేషణాలు. (Adjectives)

ఉదా; ఇది తెల్లని పుష్పం = ఇదం శ్వేతం పుష్పమ్

ఇచట పుష్పం అనే నామముయొక్క విశేషాన్ని తెలిపే తెల్లని అనే శబ్దం **విశేషణం**. పుష్పం **విశేష్యం**. ఇలాగే ఇది నల్లని కుండ=అయం **నీలః ఘటః** – మున్నగు వానిని గ్రహించునది.

సంస్కృతంలో విశేషణప్రయోగంలోని ప్రత్యేకత ఏమిటంటే, విశేష్యంయొక్క లింగవచనవిభక్తులను విశేషణం అనుసరిస్తుంది.

ఉదా: **శూరాః భటాః** = శూరులైన భటులు.
**శూరే భటే** = శూరుడైన భటునియందు.
**శూరస్య భటస్య** = శూరుడైన భటునియొక్క
**విశాలే గృహే** = విశాలమైన ఇంటిలో
**పురాతనా పేటికా** = పాత పెట్టె మొ॥

శూరాః భటాః అనే వాక్యంలో 'భటాః' విశేష్యం. 'శూర' విశేషణం. 'భటాః' పుంలింగంలో ప్రథమావిభక్తి, ఏకవచనంలో వుంది కాన విశేషణ మైన 'శూర' **కూడ** పుంలింగం ప్రథమావిభక్తి ఏకవచనంలో ఉంది. ఇలాగే 'గృహే' అనే విశేష్యంయొక్క లింగవచనవిభక్తులనే 'విశాల' అనే విశేషణం అనుసరించి 'విశాలే' అయినది. ఇలాగే ఇతరత్ర గ్రహించవలె.

## విశేషణాలను కనుగొనేది ఎట్లు?

ఎట్టి (కీదృశ); ఏ పరిమాణం (కియత్); ఎన్ని (కతి, కియత్), ఏ (కిం, కతర, కతమ) అనే ప్రశ్నలను వేయగా దొరికే జవాబే విశేషణం.

ఉదా: కీదృశం పుష్పమ్ = శ్వేతం పుష్పమ్ మొ॥
కతి పుస్తకాని? = సప్త పుస్తకాని మొ॥

సంస్కృతంలోని విశేషణాలన్నిటిని మూడు విభాగాలు చేయవచ్చు.

1. సాధారణవిశేషణాలు (Qualitatives)
2. సార్వనామికవిశేషణాలు (Pronominal)
3. ధాతుజవిశేషణాలు (Participial)

వీటిని, వీటి ప్రయోగాలను క్రమంగా తెలిసికొందాము.

### 1. సాధారణవిశేషణాలు

వస్తువుల, వ్యక్తుల రూపం, రంగు, స్థితి, గుణం, క్రియ, చేష్ట, స్వభావం, సంఖ్య మున్నగువాటిని తెలిపే పదాలు సాధారణ విశేషణాలు.

దిగువ సూచించిన సాధారణవిశేషణాలను నేర్చుకొండి—

#### అకారాంతవిశేషణాలు

రమ్య = సుందరమైన
పూజ్య = శ్రేష్ఠమైన
స్వచ్ఛ = స్వచ్ఛమైన
పురాతన, నూతన = పాత
అధునాతన, నవీన, నవ్య = క్రొత్త
మూఢ = మూర్ఖుడైన
దుష్ట = చెడ్డ
నీల, కృష్ణ = నల్లని
పీత = పసుపుపచ్చని
రక్త = ఎర్రని
ఉష్ణ = వెచ్చని
మధుర = తియ్యని
బధిర = చెవిటి
మూక = మూగి
అన్ధ = గుడ్డియైన
అమ్ల = పుల్లని

స్వచ్ఛ = శుద్ధమైన
దరిద్ర = దరిద్రమైన
సమర్థ = సమర్థమైన
ధీర = బుద్ధిగల
ప్రాజ్ఞ = తెలివిగల
కృపణ = పిసినారియైన
కర్కశ = కఠినమైన
సహృదయ = మంచిహృదయముగల
ప్రవీణ, నిష్ణాత, కుశల = నేర్పరియైన
ఉత్సుక = ఉత్సాహంగల
కారుణిక = దయగల
స్వతన్త్ర = స్వతంత్రమైన
పరతంత్ర = పరతంత్రమైన
శ్రద్ధాళు = శ్రద్ధగల
జాగరూక = మేల్కొన్న
వావదూక = వాగ్మియైన
జడ = జడమైన

తిక్త = చేదైన
శీత = చల్లని
ప్రియ = ఇష్టమైన
మలిన = మాసిన
పవిత్ర = శ్రేష్ఠమైన
శ్రేష్ఠ = పవిత్రమైన
కఠోర | కఠిన = గట్టి
కోమల = మెత్తని
మృదు = సున్నితమైన
అతీన్ద్రియ = ఇంద్రియాలకు అగుపడని

దీన = దీనుడైన
హృద్య = మనసుకింపైన
జఘన్య = కడపటపుట్టిన
చరమ = కడపటి
పాశ్చాత్య = తర్వాతపుట్టిన
మోఘ | నిరర్థక = వ్యర్థమైన
సాధారణ | సామాన్య = సాధారణమైన
దివ్య = దేవతాసంబంధమైన | కాంతిగల

ఉదాహరణమాలా —

ఇదం రమ్యం దృశ్యమ్ = ఇది రమ్యమైన దృశ్యం.
నవీనస్య పుస్తకస్య మూల్యం కియత్? = కొత్త పుస్తకంయొక్క ధర ఎంత?
పూజ్యం శఙ్కరం నమామి = పూజ్యుడైన శంకరునకు నమస్కరించుచున్నాను
ధర్మక్షేత్రే కురుక్షేత్రే మామకాః పాణ్డవాశ్చ కిమ్ అకుర్వత = ధర్మక్షేత్రమైన కురుక్షేత్రంలో నా వారున్నూ పాండవులున్నూ ఏమి చేశారు?
స్త్రీషు దుష్టాసు వార్ష్ణేయ జాయతే వర్ణసఙ్కరః = స్త్రీలు దుష్టులైతే వర్ణ సంకరం ఏర్పడుతుంది.
కులక్షయే ప్రణశ్యన్తి కులధర్మాః సనాతనాః = కులక్షయం కాగా సనాతనమైన కులధర్మాలు నశించిపోతాయి.
మాధవః పాణ్డవశ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః = మాధవుడూ, అర్జునుడూ దివ్యమైన శంఖాలను పూరించారు.
త్రైగుణ్యవిషయాః వేదాః = వేదాలు త్రైగుణ్యవిషయాలు.
నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప! = ఓ అర్జునా! విభూతలకు అంతు లేదు.
ఇంద్రియాణి ప్రమాథీని = ఇంద్రియాలు ప్రమథనశీలములు.

(మిగతా వచ్చేసంచికలో)

# సంస్కృత పాఠమాలా

## 21వ పాఠము

(గతసంచిక తరువాయి)



గతంలో అకారంత విశేషణాలను వాటి ప్రయోగాన్ని కొంతవఱకు తెలిసికున్నారు. ఈ విశేషణాలు విశేష్యం పుంలింగంలో ఉన్నపుడు రామశబ్దంవలెనూ, స్త్రీలింగంలో వుంటే 'రమా' శబ్దంవలెనూ నపుంసక లింగంలో వుంటే, 'జ్ఞాన' శబ్దం వలెనూ వర్తిస్తాయి.

ఉదాహరణమాలా :-

నీలః మేషః = నల్లని మేక. నీలా గౌః = నల్లని ఆవు.
నీలం కుసుమమ్ = నల్లని పువ్వు.
శ్వేతాలతా = తెల్లని తీగ. శ్వేతం పుష్పమ్ = తెల్లని పుష్పం.
వ్యవసాయాత్మికా బుద్ధిరేకేహ కురునన్దన = ఓ అర్జున! ఇచట వ్యవసాయాత్మికమైన బుద్ధిని కలుగుము.
శ్వేతాయాః గోః మూల్యం కియత్ = తెల్లని ఆవు వెల ఎంత?

ఇకారాంతవిశేషణాలు :-

శుచి = శుద్ధమైన; జజ్ఞి = జ్ఞానంకల; పృశ్ని = సన్నని శరీరం గలిగిన; సురభి = సువాసనగల; ఫలేగ్రహి = ఫలించునది. మొ॥

ఇవి విశేష్యం పుంలింగంలో వుంటే 'హరి' శబ్దంవలెనూ స్త్రీలింగంలో వుంటే 'మతి' శబ్దంవలెనూ నపుంసకలింగంలో వుంటే 'శుచి' శబ్దంవలెను వర్తిస్తాయి.

ఉదాహరణమాలా :

రామః శుచిం ఘటమ్ ఆనయతి = రాముడు శుభ్రమైన కుండను తెస్తున్నాడు.

శుచౌ దేశే దేవం ధ్యాయేత్ = శుచియైన స్థలంలో దేవున్ని ధ్యానించవలె.

గోపాలః శుచీని వస్త్రాణి ధారయతి = గోపాలుడు శుభ్రమైన దుస్తులు ధరించినాడు.

సురభి కుసుమమ్ ఆనయ = సువాసనగల పుష్పం తెమ్ము.

సురభిణి పుష్పే భ్రమరః వర్తతే = సుగంధిలమైన పుష్పంలో తుమ్మెద కలదు.

విప్రః శుచిః, తస్య భార్యాపి శుచిః = విప్రుడు శుచి, అతని భార్యయు శుచి.

శుచీనాం శ్రీమతాం గేహే యోగభ్రష్టోఽభిజాయతే = శుచియైన శ్రీమంతుల ఇంటిలో యోగభ్రష్టుడు పుట్టును.

ఫలేగ్రహయః ఆశిషాం స్తోమాః = ఫలింపగలఆశిస్సుల సమూహాలు.

ఈకారంతవిశేషణాలు :

దైవీ = దివ్యమైన; కల్యాణీ = మంగళకారియైన; భగవతీ = పూజ్యురాలైన; భోగవతీ = భోగాలు కలది; మహతీ = గొప్పది; చారుమతీ = మంచి బుద్ధిగలది; బహ్వీ = చాల; స్వాద్వీ = రుచికరములైన; సాధ్వీ = మంచి ప్రవర్తనగల; నీలీ = నల్లని మొ॥ ఇవి అన్నీ సామాన్యంగా స్త్రీలింగాలు. ఇవి విశేష్యం స్త్రీలింగంలో వుంటే 'గౌరీ' శబ్దంవలె మారుతాయి.

ఉదాహరణమాలా —

ఇయం భగవతీ సీతా = ఈమె పూజ్యురాలైన సీత

కల్యాణీం వాచం వద = మంగళకరమైన మాటల నాడుము.

ఇయం భోగవతీ నగరీ = ఈ నగరం భోగాలు కలది.

ఏషా చారుమతీ వనితా = ఈమె మంచి బుద్ధిగల స్త్రీ.

దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా = ఈ నా మాయ దివ్యమైనది, గుణమయమైనది.

మమ మిత్రస్య వృషభః శుక్లః, మహిషీ తు నీలీ = నా మిత్రుని ఒక ఎద్దు తెల్లనిది; గేదె నల్లనిది.

భక్తః కైలాసే శాశ్వతీః సమాః వసతి = భక్తుడు కైలాసంలో శాశ్వతమైన ఏళ్ళు నివసించును.

కశ్యపస్య బహ్వ్యః ప్రజాః = కశ్యపునికి చాలా సంతానం.

నీల్యాః పట్యాః మూల్యం కియత్ = నల్లని వస్త్రంయొక్క ధర ఎంత?

ఏతాం మహతీం చమూం పశ్య = ఈ గొప్ప సేనను చూడుము.

— మిగతా వచ్చే సంచికలో

అనాత్మజడం. దీనికి భోగశక్తి – అనుభవించేశక్తి లేదు! అంతేకాదు; భూమి జలం, అగ్ని, గాలి, ఆకాశం, శరీరాలు, ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహం కారం, ప్రాణం అనే అనాత్మరాశి అంతా మన మెలుకువలోనే కనిపిస్తుంది, లేదా మన కలలో కనిపిస్తుంది. ఈ అనాత్మ నిద్రలో ఉరువే లేకుండా పోతుంది· ఇలాంటి అనాత్మ అవస్థలను ఎలా అనుభవిస్తుంది! అవస్థల్లోతోచే అనాత్మ అవస్థనే ఎలా అనుభవింప గల్గుతుంది? కాన ఆత్మ, అనాత్మ అనే రెండు తప్ప మరేమీ లేవు. ఈ రెండింటిలో ఆత్మ ఒక్కటే సత్యం. ఆత్మకు గాని అనాత్మకుగాని అవస్థలు లేవు. ఈ విచారం విన్నాక 'స్వామీ, మీరేమో అవస్థలు లేవని నిరూపించారు కాని అవస్థలు ఉన్నట్లు తోస్తు న్నాయే కదా?' అని మీరు అడుగవచ్చు. 'అవును, మీరు చెప్పినట్లే వున్నట్లు తోస్తున్నాయేగాని అవి వాస్తవంగా లేవు అని మీరే ఒప్పుకున్నట్లే కదా?' కాన ఆత్మయందు అవస్థలు కానీ దాని కారణమైన అవిద్య కానీ లేవు. ఉన్నది ఒక్క నిర్విశేషాత్మయే!

॥ ఓం నారాయణ ॥



## తులసీదాసుని రామభక్తి

[వినయ పత్రిక నుండి]

### క ల్ప త రు వు



భరోసో జహి దుస్రో సో కరో
మోకొ తో రామ్‌కో నామ్।
కల్పతరు కలి కల్యాణ ఫరో॥

మనిషి తాను నమ్మిన పని చేయని, నాకు సంబంధించినంత వరకూ ఈ కలియుగంలో రామనామమే కల్పతరువు. ఇదే పురుషార్థం అనే ఫలాన్నిస్తుంది.



# సంస్కృత పాఠమాలా

## 21వ పాఠము

(గతసంచిక తరువాయి)



**ఉకారంతవిశేషణాలు :–**

గురు = బరువైన, పెద్దదైన; లఘు = తేలికైన; చారు = సుందరమైన, మంచి. బహు = ఎక్కువ; మధు = తియ్యని, త్రస్ను = భయపడిన; పరాసు = చచ్చిన; శ్రద్ధాళు = శ్రద్ధగల; బభ్రు = పచ్చని, బట్టతలగల; భవిష్ణు = కాగల, స్వాదు = రుచియైన; సాధు = మంచిస్వభావంగల; ప్రాంశు = ఎత్తైన; భీరు = పిరికిపందయైన: వన్దారు = మ్రొక్కుస్వభావంగల హృదయాళు = మంచి మనసుగల; మృదు = మెత్తని; నిద్రాళు(శయాళు) = నిద్రపోవు స్వభావంగల; శుభంయు = శుభంతోకూడుకున్న; వల్గు = చక్కని ఫల్గు = సారంలేని; భ్రాజిష్ణు = ప్రకాశించు.

విశేష్యం పులింగంలో ఉంటే ఇవి 'శంభు' శబ్దంవలెనూ, నపుంసక లింగంలో వుంటే 'మృదు' శబ్దంవలెనూ స్త్రీ లింగంలో ఉంటే మృద్వీ, గుర్వీ సాధ్వీ మున్నగు రూపాలు దాల్చి 'గౌరి' శబ్దవలె ప్రవర్తిస్తాయి.

**ఉదాహరణమాలా :**

రామస్య భార్యా **సాధ్వీ** = రాముని భార్య సాధ్వి.
ధేనుః **సాధ్వీ** = ధేనువు సాధుజంతువు.
రామః **సాధుం** పురుషమ్ ఆహ్వాయతి = రాముడు మంచి పురుషుని పిలుస్తున్నాడు.
ఏతే **ప్రాంశవో** భటాః = వీరు ఎత్తైన భటులు.
ఏతే **సాధవో** జనాః = వీరు మంచి వారు.
రామః సీతాయై **మృదూని** వస్త్రాణి ఆనీతవాన్ = రాముడు సీతకోసం మృదు వస్త్రాలను తెచ్చినాడు.
అత్ర **మృదవః** పటాః సన్తి = ఇచట మెత్తని బట్టలు కలవు.
గురవో **బహవః** సన్తి శిష్యవిత్తాపహారకాః = శిష్యుల ధనాన్ని దొంగిలించే గురువులు చాలా మంది కలరు.

ఇమాని లఘూని వచనాని = ఇవి తేలికైన మాటలు.
విద్రాళోః కుమ్భకర్ణస్య అగ్రజః రావణః = నిద్రపోతైన కుంభకర్ణుని అన్న రావణుడు.
గురవే భక్తాః స్వాద్వీః ద్రాక్షాః, సురభీణి ఫలాని ఆనయన్తి = భక్తులు గురువుకోసం తియ్యని ద్రాక్షలను సువాసనగల పండ్లను తెస్తున్నారు.
బహూని మే వ్యతీతాని జన్మాని తవచార్జున = అర్జున, నాకూ నీకూ ఎన్నో జన్మలు గడచినాయి.

**ఋకారాంతవిశేషణాలు :—**

కర్తృ = చేసెడి; భర్తృ = భరించెడి; గన్తృ = వెళ్ళెడి; స్మర్తృ = స్మరించెడి; ప్రమాతృ = సరిగా తెలిసికొనెడి.

విశేష్యం పుంలింగంలో వుంటే కర్తృ (పుంలింగంలో) శబ్దం వలెనూ నపుంసకలింగంలో ఉంటే కర్తృ, కర్తృణీ.... అనియూ స్త్రీలింగమైతే ఈకారాంతంగా అనగా, కర్త్రీ, గన్త్రీ మున్నగు విధాల మార్చుకుని గౌరి శబ్దం వలె నడుపవలె.

**ఉదాహరణమాలా :**

కర్తారం పరమేశ్వరం వన్దే = విశ్వానికి కర్తయైన పరమేశ్వరునకు నమస్కరిస్తున్నాను.
తస్య కర్తారమపి మాం విద్ధి అకర్తారమవ్యయమ్ = దానికి కర్తయైన నన్ను అకర్తగా అవ్యయునిగా తెలిసికో.

అస్య లోకస్య భర్తుః హరేః భజనం కురు = ఈ లోకాన్ని భరించే హరియొక్క భజన చెయ్యి.

కుమార్గే గన్తారం స్వపుత్రం దృష్ట్వా ఖిద్యతి పితా = చెడ్డమార్గంలో వెళ్ళే తన పుత్రుని చూచి తండ్రి దుఃఖిస్తున్నాడు.

ప్రమాతుః ఆత్మనః నిజరూపం సాక్షీ = ప్రమాతయైన తనయొక్క నిజరూపం సాక్షి.

అస్య జగతః కర్త్రీం దేవీం భజ = ఈ జగత్తుకు కారకురాలైన దేవిని భజించు.
అభ్యాసము–1 సంస్కృతంలో వ్రాయండి—

1. ఇవి రమ్యమైన చిత్రాలు. 2. ఇది నల్లని మేక. 3. ఇది సువాసనగల పుష్పం. 4. శుచియైన జలం త్రాగు.

# 22వ పాఠము

నకారాంత విశేషణాలు.

నకారాంత పుంలింగం 'గుణిన్' గుణం కలవాడు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి. | గుణీ | గుణినౌ | గుణినః |
| సం.ప్ర.వి. | గుణిన్ | ,, | ,, |
| ద్వి. వి. | గుణినమ్ | ,, | ,, |
| తృ. వి. | గుణినా | గుణిభ్యామ్ | గుణిభిః |
| చ. వి. | గుణినే | ,, | గుణిభ్యః |
| పం. వి' | గుణినః | ,, | ,, |
| ష. వి. | ,, | గుణినోః | గుణీనామ్ |
| స. వి. | గుణిని | ,, | గుణిషు |

ఇలాగే క్రింది శబ్దాలను నడపండి.

ధనిన్ (ధనికుడు); దోషిన్ (దోషం కలవాడు); యశస్విన్ (కీర్తిగలవాడు); తేజస్విన్ (తేజస్సు కలవాడు); కోపిన్ (కోపం కలవాడు); సుఖిన్ (సుఖం కలవాడు); దుఃఖిన్ (దుఃఖం కలవాడు); మాయావిన్ (మాయ కలవాడు); త్యాగిన్ (త్యాగం కలవాడు); మేధావిన్ (బుద్ధిమంతుడు); వాగ్మిన్ (మాటకారి); భోగిన్ (భోగం కలవాడు).

ఉదాహరణమాలా:-

ఏషః ధనీ = ఇతడు ధనికుడు.
నాహం దోషీ; స దోషీ = నేను దోషి కాను, అతడు దోషి.
విద్యయా యశస్వీ భవతి = విద్యవల్ల కీర్తివంతుడగును.
తే బ్రహ్మచారిణః తేజస్వినః = ఆ బ్రహ్మచారులు తేజస్వులు.
నరేషు కోపీ చణ్డాలః = నరుల్లో కోపిష్టుడు చండాలుడు.

సర్వే సుఖినః సన్తు = అందరూ సుఖవంతులు కాని.
మాయావీ మాయయా వధ్యః = మాయావిని మాయచే చంపవలెను.
త్యాగీ సత్త్వసమావిష్టః మేధావీ ఛిన్నసంశయః = త్యాగి సత్త్వగుణంతో కూడుకొని ఆత్మజ్ఞానియై సంశయాలను పోగొట్టుకొన్నవాడగును.

నకారాంత నపుంసకలింగంలో 'గుణిన్' రూపాలు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర.వి. | గుణి | గుణినీ | గుణీని |
| సం ప్ర.వి. | హే గుణిన్, హే గుణి | హే గుణినీ | హే గుణీని |
| ద్వి.వి. | గుణి | గుణినీ | గుణీని |

మిగిలింది పుంలింగంలోవలె.

నకారాంత విశేషణ ప్రయోగం.

విశేష్యం పుంలింగంలో వుంటే విశేషణం 'గుణిన్' వలెనూ స్త్రీ లింగంలో గుణినీ, దుఃఖినీ.... అని ఈకారాంతంగా మార్చుకొని 'గౌరి' శబ్దంవలె నడచును. నపుంసకలింగంలో 'గుణిన్' యొక్క నపుంసకరూపాలను అనుసరించును.

ధనినే వసుగుప్తాయ గీతాం దేహి = ధనికుడైన వసుగుప్తునకు గీత ఇమ్ము.
ఇయం యశస్వినః భోజస్య సభా = ఇది కీర్తివంతుడైన భోజుని సభ.
కోపీ భృగుః శ్రీహరిం పాదేన తాడయామాస = కోపియైన భృగువు శ్రీహరిని కాలితో తన్నెను.
సర్వే జనాః సుఖినః సన్తు = జనులందరూ సుఖవంతులు కాని.

అభ్యాసము 1 సంస్కృతంలో వ్రాయండి.

1) తండ్రి కోపిష్ఠుడు. 2) భోజుడు కీర్తిమంతుడు. 3) పాపం వల్ల దుఃఖి అగును. 4) సుఖవంతులైన జనులకు రోగము లెక్కువ.

అభ్యాసము 2 తెనుగులో అనువదించండి.

1) మాయావినే వర్తకః ధనం యచ్ఛతి. 2) మమ మిత్రం సుఖి. 3) త్యాగీ శుకః భాగవతమ్ ఉపదిదేశ. 4) కృష్ణో భోగీ.

# సంస్కృత పాఠమాలా

## 22వ పాఠము

(గత సంచిక తరువాయి)

-ఁఁ ఁఁ-

తకారాంతవిశేషణాలు

తకారాంత నపుంసకలింగం 'జగత్' జగత్తు

| | | | | |
|---|---|---|---|---|
| జగత్ | — | జగతీ | — | జగన్తి |
| హే జగత్ | — | హే ,, | — | హే ,, |
| జగత్ | — | జగతీ | — | జగన్తి |

మిగిలినది 'మరుత్' వలె

ఇంతవరకు మీరు ఆ యా విభక్తుల్లో తకారాంత శబ్దాల రూపాలను గమనించారు. ఇపుడు తకారాంత విశేషణాలను తెలిసికుంటారు.

ఆయుష్మత్, అంశుమత్, దీప్తిమత్, ధనుష్మత్, ఏతావత్, తావత్ నభస్వత్, ప్రజ్ఞావత్, బలవత్, భాస్వత్, యావత్, లజ్జావత్, విద్యావత్, భగవత్, తత్రభవత్, ఉక్తవత్, కృతవత్, జితవత్, గతవత్, పఠితవత్.

ఈ తకారాంత విశేషణాలకు గతపాఠంలో అర్థాలను మీరు గ్రహించారు. వీటి ప్రయోగం గమనించండి.

విశేష్యం పుంలింగంలో వుంటే ఈ విశేషణాలు 'ధీమత్' వలెనూ విశేష్యం స్త్రీలింగంలో వుంటే ఈ విశేషణాలు ఈకారాంతంగా అనగా భగవత్ – భగవతీ; కృతవత్ – కృతవతీ అని మారి 'గౌరీ' శబ్దంవలెనూ విశేష్యం నపుంసకలింగంలో వుంటే 'జగత్' వలెనూ రూపాలను పొందును.

ఉదాహరణమాలా —

సీతా **భగవతీ** మాయా = పూజ్యురాలైన సీత మాయ.
**బలవతః** రామస్య చరితం మహత్ = బలవంతుడైన రాముని దివ్యచరితం.
సంస్కృతం **పఠితవతః** ఛాత్రాన్ ఆహ్వాయ = సంస్కృతం చదివిన విద్యార్థులను పిలువుము.

ముమ్బయ్యాం మహాన్తి భవనాని సన్తి =బొంబాయిలో గొప్ప భవనాలున్నాయి
తత్ర భవన్తః భవన్తః వేదపారాయణం కుర్వన్తు = పూజ్యులైన తమరు వేదపారాయణం చేయండి.
గీతాం సమ్యక్ పఠితవత్ మమమిత్రం సభాయాం ఉపస్థితమ్ =గీతను బాగా చదివిన నా మిత్రుడు సభలో కూర్చున్నాడు.
తవ శిష్యేణ ధీమతా వ్యూఢాం చమూం పశ్య = బుద్ధిమంతుడైన నీ శిష్యునిచే వ్యూహాకారంగా రచితమైన సేనను చూడుము.
శ్రీమతాం దర్శనేన మహాన్ సన్తోషః సమజని = శ్రీవారిని దర్శించడం వల్ల గొప్ప సంతోషం కలిగింది.
మాధవః పాణ్డవశ్చ మహతి స్యన్దనే స్థితౌ = మాధవుడు, అర్జునుడు గొప్ప రథంలో కూర్చొన్నారు.
స్వల్పమప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ = కొంత ధర్మం అనుష్ఠించినా చాలు అది మహాభయంనుండి కాపాడును.
భక్తిమాన్ యః స మే ప్రియః = భక్తిమంతుడే నాకు ప్రియుడు.
అన్తవన్త ఇమే దేహాః = ఈ దేహాలు నాశవంతములు.
భవన్తో మహాన్తో అనుగృహ్ణన్తు = గొప్పవారైన తమరు అనుగ్రహింతురుగాక.

అభ్యాసము 1 సంస్కృతంలో వ్రాయండి.

1) విద్యావంతుడైన పండితుడు. 2) పూజ్యులైన తమరు ఇచట కూర్చొండి. 3) భగవంతుడైన బాదరాయణుడు బ్రహ్మసూత్రములను రచించెను. 4) ఇంటికి వెళ్ళిన రామున్ని తల్లి తిట్టెను.

అభ్యాసము 2 తెలుగులో వ్రాయుము.

1) తత్రభవన్తో భవన్తః భాగ్యవన్తః 2) ప్రమాదో ధీమతామపి. 3) బలవతః ఏవ పృథ్వీ. 4) ఇయం బలవతీ సేనా.

(మిగతా వచ్చే సంచికలో)



# సంస్కృత పాఠమాలా
## 22వ పాఠము
(గత సంచిక తరువాయి)

### తకారాన్తవిశేషణాలు

ఈ విశేషణాన్ని ప్రయోగించడం నేర్వడానికి ముందు ఈ క్రింది శబ్దంయొక్క రూపాలను నేర్చుకొండి.

తకారాంత పుంలింగం – ధీమత్ – బుద్ధిమంతుడు

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | ధీమాన్ | ధీమన్తౌ | ధీమన్తః |
| సం. ప్ర. | హే ధీమన్ | ,, | ,, |
| ద్వి. వి. | ధీమన్తమ్ | ,, | ధీమతః |

మిగిలినది 'మరుత్' శబ్దంవలె నడుపండి.

మత్ ప్రత్యయాంతాలు - ఆయుష్మత్ = ఆయువుకలవాడు; అంశుమత్ = కిరణాలు కలవాడు: జ్యోతిష్మత్, భానుమత్, దీప్తిమత్ = కాంతి గలవాడు: ధనుష్మత్ = విల్లు కలవాడు; హనుమత్ = హనుమంతుడు

వత్ ప్రత్యయాంతాలు – ఏతావత్ = ఇంతమాత్రం; తావత్ = అంతమాత్రం; నభస్వత్ = ఆకాశంలో వర్ధిల్లునది; ప్రజ్ఞావత్ = ప్రజ్ఞతో కూడుకున్న; బలవత్ = బలంకల; భాస్వత్ = ప్రకాశించెడి; యావత్ = ఎంతమాత్రం; లజ్జావత్ = సిగ్గుగల; విద్యావత్ = విద్యగల: వివస్వత్ = సూర్యుడు: భగవత్ = ఐశ్వర్యంగలవాడు; భవాన్ = తమరు; తత్రభవత్ = పూజ్యులైన.

తవత్ ప్రత్యయాంతాలు: ఉక్తవత్ = చెప్పినవాడు; కృతవత్ = చేసినవాడు; జితవత్ = జయించినవాడు, గతవత్ = వెళ్ళినవాడు, పఠితవత్ = చదివినవాడు

పై శబ్దాలను 'ధీమత్' వలె నడుపండి.

తకారాంతపుంలింగం 'మహత్' = గొప్పవాడు

| | | | |
|---|---|---|---|
| ప్ర.వి | మహాన్ | మహాన్తౌ | మహాన్తః |

| | | | |
|---|---|---|---|
| సం.వి.ప్ర. | హేమహన్ | హేమహాన్తౌ | హేమహాన్తః |
| ది. | మహాన్తమ్ | మహాన్తౌ | మహతః |

మిగిలినది 'ధీమత్' వలె,

ఉదాహరణమాలా :

రామః **ధీమాన్** = రాముడు బుద్ధిమంతుడు.
ఏతే ధీమన్తః = వీరు బుద్ధిమంతులు.
అయం **హనుమాన్** = ఇతడు హనుమంతుడు.
ఏతే **మహాన్తః** = వీరు గొప్పవారు.
ఏతే **ధనుష్మన్తః** = వీరు విలుకాండ్రు.
సత్త్వం **సత్త్వవతా**మహమ్ = సత్త్వగుణంగలవారిలో సత్త్వగుణం నేను.
జ్యోతిషాం రవిరంశు**మాన్** = నక్షత్రాలలో సూర్యుణ్ణి నేను.
బహూనాం జన్మనామన్తే **జ్ఞానవాన్** మాం ప్రపద్యతే = చాలా జన్మలైన తర్వాత జ్ఞానవంతుడు నన్ను పొందును.
అహం బలవాన్ = నేను బలవంతుడను.
ఇమం **వివస్వతే** యోగం ప్రోక్త**వాన**హమవ్యయమ్ = నేను ఈ అవ్యయమైన యోగాన్ని వివస్వంతునకు చెప్పితిని.
భీష్మమేవాభిరక్షన్తు **భవన్తః** సర్వఏవ హి = మీరంతా భీష్మున్నే రక్షింతురు గాక.
అపరం **భవతో** జన్మ పరం జన్మ **వివస్వతః** = నీజన్మ ఇప్పటిది, సూర్యుని జన్మ ఎంతో ముందు.
**బుద్ధిమాన్ బలవాన్** = బుద్ధిమంతుడే బలవంతుడు.

అభ్యాసము 1 సంస్కృతంలో వ్రాయండి –

1) భగవంతుడు ప్రపంచమును రక్షించును. 2) వారు శ్రీమంతులు. 3) అతడు గీతను చదివెను. 4) వారు గొప్పవారు.

అభ్యాసము 2 తెలుగులో వ్రాయండి –

1) అత్ర శ్రీమతాం గృహాణి సన్తి. 2) అస్మాకం అధ్యాపకాః మహాన్తః 3) సః గీతాం పఠితవాన్. 4) భవాన్ భాగ్యవాన్

# సంస్కృత పాఠమాలా
## 23వ పాఠము



### మరికొన్ని సర్వనామములు (సంబంధార్థకం)

దకారాంత పుంలింగం 'యద్' ఎవడు, ఏది

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి | యః | యౌ | యే |
| ద్వి. వి | యం | యౌ | యాన్ |
| తృ. వి | యేన | యాభ్యాం | యైః |
| చ. వి | యస్మై | ,, | యేభ్యః |
| పం. వి | యస్మాత్ | ,, | యేభ్యః |
| ష. వి | యస్య | యయోః | యేషాం |
| స. వి | యస్మిన్ | ,, | యేషు |

దకారాంత నపుంసకలింగం 'యద్' ఎవడు, ఏది

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి | యత్ | యే | యాని |
| ద్వి. వి | ,, | ,, | ,, |

మిగతా పుంలింగంలోవలె

దకారాంత స్త్రీలింగం 'యద్' ఎవడు, ఎవతె, ఏది

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి | యా | యే | యాః |
| ద్వి. వి | యాం | ,, | ,, |
| తృ. వి | యయా | యాభ్యాం | యాభిః |
| చ. వి | యస్యై | ,, | యాభ్యః |
| పం. వి | యస్యాః | ,, | ,, |
| ష. వి | ,, | యయోః | యాసాం |
| స. వి | యస్యాం | ,, | యాసు |

ఉదాహరణమాలా —

యః సమ్యక్ పఠతి సః ఉత్తీర్ణో భవతి = ఎవడు బాగుగా చదువునో అతడు ఉత్తీర్ణుడగును.

యా తత్ర గచ్ఛతి సా మమ భగినీ = ఎవతె అక్కడ వెళ్ళుచున్నదో ఆమె నా సోదరి.

యా మా సా మాయా = ఏది లేదో అది మాయ.

యస్యాస్తి విత్తం సః కులీనః = ఎవనికి ధనం కలదో అతడు కులీనుడు.

యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ
యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః ॥

ఏది సకలప్రాణులకు రాత్రియో దానియందు యోగి మేల్కొనును. దేనియందు ప్రాణులు మేల్కొని ఉందురో అదే జ్ఞానియైన మునికి రాత్రి.

సా విద్యా యా విముక్తయే = ముక్తినిచ్చేదే విద్య.

యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయార్చితుమిచ్ఛతి ।
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధామ్యహమ్ ॥

ఏ యే భక్తుడు ఏ ఏ మూర్తిని శ్రద్ధతో పూజించునో, ఆ యా వ్యక్తికి ఆ యా అచలమైన శ్రద్ధను నేను స్థిరపరచెదను.

యే హి సంస్పర్శజా భోగా దుఃఖయోనయ ఏవ తే ।

విషయాలు ఇంద్రియాలు ఒకదానిని ఒకటి తాకటంవల్ల కలిగే భోగాలు దుఃఖకారణాలు.

శంకారూపేణ మచ్చిత్తం పఙ్కీకృతమభూద్యయా।
కిఙ్కరీ యస్య సా మాయా శంకరాచార్యమాశ్రయే ॥

ఏ మాయ శంకారూపమైన నా చిత్తాన్ని మలినపరచిందో, అది ఎవనికి సేవకురాలో అట్టి శంకరాచార్యులను ఆశ్రయింతును.

యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా శాస్త్రం తస్య కరోతి కిమ్ ।
లోచనాభ్యాం విహీనస్య దర్పణేన హి కిం ఫలమ్? ॥

ఎవనికి స్వయంగా ప్రజ్ఞ లేదో వానికి శాస్త్రంవల్ల ప్రయోజనం లేదు. కన్నులు లేని వానికి అద్దంతో ప్రయోజనం లేదు.

# 24వ పాఠము

(గతసంచిక తరువాయి)

## మరికొన్ని సర్వనామములు

దకారాంతపుంలింగం 'ఏతద్' = ఇది, ఇతడు.

| | ఏ | ద్వి | బ |
|---|---|---|---|
| ప్ర. వి. | ఏషః | ఏతౌ | ఏతే |
| ద్వి. వి. | ఏతం | ఏతౌ, ఏనౌ | ఏతాన్, ఏనాన్ |
| తృ. వి. | ఏతేన, ఏనేన | ఏతాభ్యాం | ఏతైః |
| చ. వి. | ఏతస్మై | ,, | ఏతేభ్యః |
| ప. వి. | ఏతస్మాత్ | ,, | ,, |
| ష. వి. | ఏతస్య | ఏతయోః, ఏనయోః | ఏతేషామ్ |
| స. వి. | ఏతస్మిన్ | ,, ,, | ఏతేషు |

తకారాంత నపుంసకలింగం 'ఏతత్' ఇది, ఇతడు

ఏతత్ – ఏతే – ఏతాని

ఏతత్, ఏనత్ – ఏతే, ఏనే – ఏతాని, ఏనాని మిగతా పుంలింగంలోవలె.

దకారాంత స్త్రీ లింగం 'ఏతద్' ఈమె, ఇది

| | | |
|---|---|---|
| ఏషా | ఏతే | ఏతాః |
| ఏతాం, ఏనాం | ఏతే, ఏనే | ఏతాః, ఏనాః |
| ఏతయా, ఏనయా | ఏతాభ్యాం | ఏతాభిః |
| ఏతస్యై | ,, | ఏతాభ్యః |
| ఏతస్యాః | ,, | ,, |
| ,, | ఏతయోః, ఏనయోః | ఏతాసామ్ |
| ఏతస్యాం | ,, ,, | ఏతాసు |

ఉదాహరణమాలా

ఏషా లతా = ఇది తీగె. ఏతాని భాష్యాణి = ఇవి భాష్యాలు.

ఏతం గ్రన్థమ్ ఆనయ = ఈ గ్రంథాన్ని తెమ్ము.

ఏతస్మై ఫలం యచ్ఛ = ఇతనికి పండు ఇమ్ము.
ఏతస్మాత్ అస్మాకం భయం నాస్తి = ఇతనివల్ల మనకు భయం లేదు.
ఏషః గ్రన్థః = ఇది గ్రంథం. ఏషః మనుష్యః = ఇతడు మనిషి.
ఏతస్మిన్ కిమ్ అస్తి? = ఇందులో ఏముంది?
ఏతాని పత్రాణి = ఇవి ఆకులు. ఏతత్ ఫలమ్ = ఇది పండు.
కామ ఏష క్రోధ ఏష రజోగుణసముద్భవః = ఈ కామం ఈ క్రోధం రజోగుణంనుండి పుట్టినవి.
ఏతాన్నహన్తుమిచ్ఛామి ఘ్నతోఽపి మధుసూదన = ఓ మధుసూదన, నేను చచ్చినా పర్వాలేదు కాని వీరిని చంపగోరను.
పర్యాప్తం త్విదమేతేషాం బలం భీమాభిరక్షితమ్ = భీమునిచే రక్షితమైన ఈ సేన పర్యాప్తంగా ఉంది.
దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా = దివ్యమైన గుణమయమైన ఈ నా మాయ అతిక్రమించరానిది.
మామేవ యే ప్రపద్యన్తే మాయామేతాం తరన్తి తే = నన్నే శరణు బొందినవారు ఈ నా మాయను దాటెదరు.
ఏష సర్వేశ్వరః, ఏష సర్వజ్ఞః ఏషోఽన్తర్యామ్యేష యోనిః = ఇతడే (సుషుప్తాత్మయే) సర్వేశ్వరుడు, ఇతడే సర్వజ్ఞుడు, ఇతడే అంతర్యామి, ఇతడే జగత్కారణం.

అభ్యాసం 1 సంస్కృతంలో వ్రాయండి.

1) ఇతడు మా తండ్రి. 2) వీరు మా గురువులు. 3) దీనియందు నీరు కలదా? 4) ఈమెయొక్క పేరేమి? 5) ఇతడు నా మిత్రుడు. 6) అచట ఎవడు గీతను చదువుచున్నాడో అతడు నా మిత్రుడు. 7) ఎవడు దానం చేయునో అతడు పుణ్యమును పొందును.

అభ్యాసం 2 తెలుగులో అర్థమును వ్రాయండి.

1) యః తత్ర వేదం పఠతి సః అస్మాకం మాతులః. 2) ఏతస్మై ఫలాని దేహి. 3) ఏతేభ్యః అస్మాకం భయమస్తి. 5) ఏతాః పేటికాః.

# సంస్కృతపాఠమాలా
## 25వ పాఠము

### విద్యార్థులకు కొన్ని ముఖ్యసూచనలు

* ఇకటి పాఠాలు నాగరలిపిలో ఇవ్వబడలేదు. నాగరలిపి నేర్వండి. హైస్కూళ్ళలో హిందీ నేర్చినవారికి నాగరలిపి తెలుసు.

* పాఠాలలో ఇవ్వబడిన ఉదాహరణవాక్యాలను బాగుగా పరిశీలించండి. మొదట్లో సంధి, సమాసాలు తెలిసుకోకపోయినా పర్వాలేదు. ముమ్ముందు నేర్చుకుంటారు. అభ్యాసాలను నిదానంగా సాధించండి.

* ఆ యా విభక్త్యంతరూపాలకు గీత మున్నగు చోట్ల నుండి ఉదాహరణలివ్వబడుతున్నాయి. మీరు భగవద్గీతలో వాల్మీకిరామాయణం మున్నగు గ్రంథాల్లో ఇలాంటి ప్రయోగాల శబ్దాలను వాక్యాలను ఏరి వ్రాయండి.

* అ ఇ ఉ ఋ ౡ – ఇవి హ్రస్వ స్వరాలు (అచ్చులు). ఆ ఈ ఊ ౠ ఏ ఐ ఓ ఔ – ఇవి దీర్ఘస్వరాలు. క ఖ గ ఘ ఙ – కవర్గం చ ఛ జ ఝ ఞ – చవర్గం. ట ఠ డ ఢ ణ – టవర్గం. త థ ద ధ న – తవర్గం. ప ఫ బ భ మ – పవర్గం. ఈ ఐదువర్గాల అక్షరాలూ య ర ల ళ వ శ ష స హ అనే అక్షరాలూ వ్యంజనాలు. అంటే హల్లులు అని పిలువబడతాయి. 'క్ష' స్వతంత్రమైన అక్షరం కాదు. కకార షకారాలు కలిసి 'క్ష' ఏర్పడును. ం = అనుస్వారం. ః = విసర్గం.

* అక్షరాలను అకారం ('అ' అనే అక్షరం), కకారం, ఖకారం – ఇలా 'కార' అనే మాటను చేర్చి వాడతారు. రకారానికి రేఫమని మారు పేరు ఉంది.

* క, ఖ మున్నగు వ్యంజనాలను వాస్తవంగా క్ ఖ్ గ్.... అని ఉచ్చరించవలె. కాని ఉచ్చారణాసౌలభ్యానికై అకారం చేర్చి క ఖ గ....అని ఉచ్చరిస్తున్నాం.

* స్వరాలకు, స్వరాలు చేరిన వ్యంజనాలకు అక్షరం లేక వర్ణం అని పేరు.

* అనుస్వారం, విసర్గం, – వీటి ఉచ్చారణను తజ్ఞులవల్ల తెలిసికొండి. అనుస్వారాన్ని 'మ్' అని గాని విసర్గను 'హ' అని గాని ఉచ్చరింపరాదు.

* వర్గాల్లో కడపటి అక్షరాలను అంటే 'ఙ ఞ ణ న మ' అనే వాటికి అనునాసికాలు అని పేరు. ఇవి ముక్కునుండి ఉచ్చరింపబడతాయి. కాన ఆ పేరు వచ్చింది. పదముల మధ్య వాటిని రాసేటప్పుడు వాటికి బదులు అనుస్వారాన్ని (సున్నను) వ్రాయరాదు.

ఉదా:– 'నందః' అని వ్రాయరాదు 'నన్దః' అని వ్రాయవలె. సంగః అని వ్రాయరాదు. సఙ్గః అని వ్రాయండి. 'సంచయః'కు బదులు సఞ్చయః అనీ, మండపః బదులు మణ్డపః అనీ, 'అంబరమ్'కు బదులు 'అమ్బరమ్' అని వ్రాయండి. అనుస్వారం తర్వాత వచ్చే అక్షరం ఏ వర్గంలో ఉందో ఆ వర్గంలోని అనునాసికాన్నే ఉపయోగించాలె. ఉదా:– సఞ్గః అనేది తప్పు. 'ఞ' అనే అనునాసికం చవర్గంలోది. కాని ఇచట 'గ' అనేది కవర్గంలోనిది. కాన అదే వర్గంలోని అనునాసికాన్ని 'ఙ' అంటే 'సఙ్గః' అని వ్రాయవలె. ఇతరత్ర కూడా ఇలాగే.

* మకారాంత శబ్దానికి ముందు అచ్చు ఉంటే దానికి సున్న రాయరాదు. ఉదా:– 'కిమ్ ఏవమ్' దీన్ని 'కిం ఏవం' అని వ్రాయడం తప్పు. అనుస్వారం తర్వాత కానీ మకారాంతశబ్దం ముందు కానీ హల్లు ఉంటే దానికి సున్న పెట్టండి, కాని ఉచ్చారణ సరిగా చేయవలసింది. ఉదా: కిం యమః? అయం రామః. త్వం లక్ష్మీః, అహం వదామి – ఈ వాక్యాల్లో అనుస్వారసంబంధమైన ఉచ్చారణ అవసరం. ఇదం కమలమ్, అహం ఛాత్రః కిం ఫలమ్ – ఇచట వర్గీయవ్యంజనాల ఉచ్చారణ అవసరం. వాక్యాంతంలోని అనుస్వారాన్ని 'మ్' అని వ్రాయండి.

అభ్యాసం 1 తప్పులను సరిదిద్దండి—

పంచమీ. గంగా. సింధూ. కిమ్ప్రయోజనం? ఇంద్రః. పంచపాండవాః. రాజ్యాంతే నరకమ్ ధ్రువం. ఆచార్యం ఉపసంగమ్య. పాండవానామ్ ధనంజయః. చందనమ్ న వనే వనే. భక్త్యా భాగవతమ్ జ్ఞేయం. నందః పరమానందః. తత్ త్వం అసి. అహమ్ బ్రహ్మాస్మి.